శ్రీః

శ్రీరామాయనమః

# సుభద్రార్జునీయము.

ఆరంకముల నాటకము

ఇయ్యది

అనంతపురం జిల్లా కదిరి తాలూకా
ఇనగలూరు గ్రామములో నుండు
పంచరత్నం సుబ్బరామప్ప గారిచే

రచియింపబడినది.

మొదటి కూర్పు. 1000 ప్రతులు.



మదనపల్లె
...ప్ అండు కో., "ఆన్కర్" ముద్రాక్షరశాలయందు
ముద్రితము.

1933.

వెల, రూ. 1—0—0.

శ్రీః

శ్రీరామాయనమః

# సుభద్రార్జునీయము.

## ఆరంకముల నాటకము

ఇయ్యది

అనంతపురం జిల్లా కదిరి తాలూకా

ఇనగలూరు గ్రామములో నుండు

పంచరత్నం సుబ్బరామప్ప గారిచే

రచియింపబడి

కదిరి తాలూకా - ముత్యాలచెర్వు గ్రామం

కరణం సుబ్బరాయప్పగారి ద్రవ్యసహాయముచే,



మదనపల్లె

హూప్ అండు కో., "ఆన్కర్" ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

---

1933.

# విజ్ఞప్తి.

---

మహాశయులారా ప్రపంచమునం దెందరో మహనీయ్యులు రచియించిన నాటకము లనేకములుండ నే నీచిన్న నాటకంబును వ్రాసి యిది బరికింప మహా మత్తేభేంద్రయూధ మధ్యంబున మశక ప్రాయంబుగా దోపక మానదు. ఇందెన్ని లోపములున్నను క్షమింప బ్రార్థించెద.

మరియు ఈ నాటకము రచింప నెంతయూ పురికొల్పి నన్ను గాంచిన దైవముగా నెంచుచు సుగుణాభిరామయుక్తుడై నిరతాన్నదానపరుడై సత్యవాక్య ధురీణుడై శ్రీమదష్టముఖ గండభేరుండ జ్వాలా నృసింహోపాసనాపరుడై ముప్పదేడులకే మేయ ప్రతిష్ఠ నార్జించి పష్ఠదశకంబు గ్రామ కరణీకం బొనర్చి రౌద్రి సంవత్సర కార్తిక శుద్ధ నవమీ భృగు వాసరంబున పరమపదంబలంకరించిన నాసహోదరుడు సీతారామాభిఖ్యుండు పునరావృత్తిరహిత శాశ్విత బ్రహ్మపదం బొందుగాత.

అట్లు రచియించిన యీనాటకమును

సీ॥ శ్రీరామ పట్టాభిషేకంబు లొనరించె
పరుస నిర్వదినాల్గు వత్సరములు ।
ధరణి విభునిబోలి కరణీక మొనరించె
ముప్పదియేడులి ప్పూరమునందు ।
సంతాన సౌభాగ్య సాగరంబున దేలి
నిరతాన్నదానభా సురతదనరె ।
వ్యవహారముఖమునం దవమాన మొనరించె
శత్రులపల్వుర వృత్రసముల ।

గీ॥ సూర్యనారాయణాఖ్య సంశోభితుండు ।
శౌనక సగోత్ర విస్తారుడైన యట్టి ।
నాదు జనకుండు సంతతామ్నాయపథుడు
అతని నుతియింప నాతరంబౌనె మఱియు ॥

గీ॥ క్రోధివత్సరమార్గశీర్షోత్తరాఖ్య ।
పక్ష పంచమి భూపుత్ర వాసరమున ।
సమరపుర వైభవానంద మనుభవింప ।
జనియె సూర్యాంతర ద్వారమునను దూరి ।

గీ॥ అట్టి నాతండ్రి సద్గుణ పట్టభద్రు ।
డాదరానంద భావుండు వేదమయుని ।
పాదపద్మార్పణము జేతు భక్తితోడ ।
నీ సుభద్రార్జునీయ్యంబు నిశ్చయముగా ॥

ఎట్లో పరమేశ్వరుని కరుణచే నీ నాటకము వ్రాసితిగాని రాజకీయోద్యోగ విషయమై తీరరాని వ్యవహారము తటస్థించినందున చతుస్సహస్ర రూప్యంబులా వ్యవహారదేవత కర్పించి రిక్తహస్తుండనగుటచే నచ్చొత్తించి ప్రకటపఱుచుటకు వలనుపడక మిడుకుచుంటి నీవృత్తాంతంబు విని (తహ్సీ, డిహ్సీ) నేత్రాయుశతక నాటక నవలలపై మిగుల ప్రీతిపాత్రుండగుటచే

సీ॥ శ్రీనంద వరవంశ క్షీరపారావార
రాకావిరాజ కైరవహితుండు ।
అశ్వలాయన సూత్రుడలవసిష్ఠ సగోత్రు
డలఘుడన్నాసామి యాత్మజుండు ।
ముత్యాలచెర్వునా పురవర కరణంబు
వేదవేదార్థ సమ్మోదితుండు ।

అనవరతోన్నదానానంద హృదయుండు
హరిహర పూజాధి కాభిలాషి ।

గీ॥ సుబ్బరాయాభిధానుండు సుజనహితుడు ।
కరుణ నెట్టించి నాటక క్రమముగాంచి ।
కీర్తి యోచించి నను గాంచి కృష్ణు నెంచి ।
యచ్చునొత్తించె నీసుభద్రార్జునంబు ॥

పరమపురుషుం డిమ్మహానీయుని కాయురారోగ్యైశ్వర్య పుత్ర పౌత్ర యశఃప్రతాప నిరవద్యకీర్తి బ్రహ్మతేజంబు లొసంగుగాక.

ఇనగలూరు,
12—11—1927.

ఇట్లు విన్నవించు,
పంచరత్నం సుబ్బరామప్ప,
గ్రంథకర్త.



# నాటకమునవచ్చు ముఖ్యపాత్రములు.



## పురుషులు

ధర్మరాజు<br>
భీముడు<br>
అర్జునుడు—కథానాయకుడు<br>
నకులుడు<br>
సహదేవుడు<br>
} పాండవులు

దుర్యోధనుడు<br>
కర్ణుడు<br>
శకుని<br>
వికరుడు<br>
} కౌరవులు

గార్గ్యుడు—యాదవపురోహితుడు

శ్రీకృష్ణుడు<br>
బలరాముడు<br>
గదుడు<br>
} యాదవులు

విశారదుడు—బ్రాహ్మణుడు, అర్జుననిమిత్రుడు

విద్యున్మాది<br>
తామ్రకేశుడు<br>
జ్వాలాజిహ్వుడు<br>
కరాళదంష్ట్రుడు<br>
రుధిరాక్షుడు<br>
} రాక్షసులు<br>
ఇతడే మాయావిశోకుడగును.

యతి—అర్జునుని సన్యాసవేషము

## స్త్రీలు

ఉలూచి—నాగకన్యక

సుభద్ర—కథానాయిక

కుముద్వతి<br>
ఉత్పల<br>
} సుభద్ర చెలులు

రుక్మిణి<br>
సత్యభామ<br>
} కృష్ణునిభార్యలు



# పండితాభిప్రాయములు.



బ్ర॥ పంచరత్నము సుబ్బరామ కవిగారికి.

మహాశయా!

గీ॥ తమ సుభద్రార్జునీయ మిత్త్రజానిఁగంటిఁ।
పాత్ర సంభాషణంబును పద్యగద్య।
హృద్యరచనా చమత్కృతి నింపు నింపె।
నాంధ్ర నాటకములఁ బేరునందఁగలదు॥

ఉ॥ సూనమరంద బిందువులు సోనలుగాఁగురిపింపజాలునీ।
దైన కవిత్వరీతి ముదమారగఁ గాంచుచునున్నఁ జాలదే।
తేనియ సోనలేల? మఱిఁ దీయని పానకమేల? యామినీ।
జానికళాస్రవద్విశదచంద్ర శిలాఫలకంబులేటికో॥

చ॥ సరసకవిత్వతత్త్వ విలసద్రచనాపరిపాటిఁ గాంచని। బ్బరపు
టూయారపుంబెళుకుపైఁ దలికమ్మదనంపు సొంపువా।
తెఱమునిపంట నొక్కిన గతిన్ రసముల్ బచరింపఁ జేసియు
చ్చెరువనిపించె నిక్కమిఁకఁ జెప్పెడిదేమిటి? సుబ్బరాట్కవీ॥

ఇట్లు,

ఆశుకవి చక్రవర్తి అభినవ బాణకవి
రామకృష్ణ సీతారామ సోదరకవులు,
శతావధానులు.

21—1—33. గజ్జలకొండ పోస్టు, మార్కాపురం తాలూకా.



# సుభద్రాపరిణయము

## నాటకము.



శా॥ శ్రీ మీరన్ వసుదేవ పుత్రుడయి సు
శ్రేయంబునన్ గాంచి ని ।
త్యామోదంబున పాండవేయులను సౌ
హార్ద్రింబునన్ బ్రోచి శ్రీ ।
కౌమారీ పతి భక్తవ్రాత సమునకున్
కల్యాణ సంధాయియై ।
భూమిన్ సింహ వహించినట్టి హరి మ
మ్మున్ బ్రోచున శ్రాంతమున్ ॥

నటుడు. (౧ అనుబంధము).

అహో! యిదివారు సద్గుణసంపన్నులగు బ్రాహ్మణోత్తములును సత్య ధర్మ భుజాబల శాలీనులగు క్షత్రియులును నిజవర్ణ నియమిత మార్గానుసారులౌ వైశ్యులును యాచకకల్ప మహీరుహంబులగు శూద్రశ్రేష్ఠులును మఱియు నానావర్ణ సముత్పన్నులున్ గలసి క్షీరోదక న్యాయంబుచే సత్యాగ్రహ సువ్రత నిరతులై యీసభ నలంకరించియున్నవారు. వీరిమనంబున కానందంబు గల్గునట్లు లేదేని యొక్క నాటకంబు ప్రదర్శింపవలయునని వాంఛ పొడమినది యేనాటకము ప్రకటింపవలయు (యోచించి) కానిమ్ము ప్రేయసీ (యని పిలచును).

(నటి ప్రవేశించి) ఆర్యా! యేలపిలచితిరి?

నటు—దిగంతవిశ్రాంత యశోధవళ పరిపూరితులైన యీ సభాసదుల మనములు
రంజింప నేదేని యొక్క నాటకము ప్రదర్శింపవలయునని వాంఛబొడమి
నిన్ను బిలిచితిని, యేనాటక ముపక్రమింపవలయు.

నటి—అభినవ సుభద్రార్జునీయంబుండ లేదా!

నటు—అందుల కృతికర్త ఎవరు?

నటి— పంచచామరం.

సుపంచరత్న వంశజుండు - సూరపార్య పుత్రుడుఁ ।
అపార విష్ణుభక్తి పూర్ణు - డార్య సద్విధేయుడుఁ ।
కపాలి పంచవర్ణ మంత్ర - గౌరవుండు విప్రుడుఁ ।
సుపంథయాను డినగలూరు - సుబ్బరామ పాఖ్యుడౌ ॥

నటు—ఈతనిచే రచియింపఁబడిన గ్రంథంబు లింక నెవ్వియైనఁ గలవా?

నటి—ఉన్నవి. కళాభానువిజయంబను నవలఁ వ్రాసి యాంధ్రభారతి కర్పించి
యున్నవాడు. లక్ష్మీనృసింహ శతకమురచించి శ్రీఖాద్రి లక్ష్మీనృసింహ
మూర్తి కర్పించియున్నవాడు. యీ నాటకముఁ సృజించి తనతండ్రి
కర్పించియున్నవాడు. రుక్మిణీకల్యాణమును యక్షగానముగా నిర్మించి
తనయిష్టదైవమగు శ్రీరామమూర్తికర్పించి యున్నవాడు. కోయిల్ ధనాల
దేవరాజదాసకృత వచన భక్తవిజయమునం దిరువదియైదు దాసుల చరిత్ర
ములు పద్యములుగా నిర్మించి శ్రీ ఖాద్రి లక్ష్మీనృసింహ ప్రీతియొనర్చి
యున్నవాడు. యింతమాత్రము నాకు దెలియును.

నటు—ఇంకను డెబ్బది వ్రాయనిమ్ము చింతలేదు. యీతని కృతులు నీవు పఠించి
యున్నావా? అట్లైన నీతని కవనముపై నీయభిప్రాయమేమి?

నటి—ఇతరేమియు జరుపలేదని నాకు దృఢముగా దెలసు. శ్రీపరమేశ్వరాను
గ్రహమే. యీతనికవిత్వమున కాధారము. రసపోషణయందు మా
బోటి మూఢుల మనములు రంజించుననియే నేననుకొన్నానుగాని తమ
వంటి పండితుల మనంబు లెట్లు పరిణమించునో నెరసులేమిగలవో
నేజెప్పజాలను. అంతటియోగ్యత నాకుజాలను.

నటు—కానిమ్ము, నీయిష్టమున కెందుకు భంగమొనర్పవలయు చదివి చూచిన

పిమ్మటగదా గుణదుర్గుణములు నిర్ణయింపవలయు; గాని యేదేని మనోహ రంబగు గీతంబుఁ బాడుము.

నటి.—దేనినిగూర్చి?

నటు.—ఋతువతంసమగు వసంత ఋతువునుఁగూర్చి.

నటి.— వృత్తము.

సుమసంతతుల్ ఫలగుచ్ఛముల్ పరి - శుద్ధ
సుందర మంజరుల్ ।
ధుమిమచిత్రముల్ మధు ధారలుఁ వర - ధూళి
కేతన సౌమ్యముఁ ।
ప్రమదాళి గీతము సప్తభిశ్శృతి - పారమై
బహు సారమై ।
విమలంబయెఁ మధు వాసరంబులు - విశ్వ
మోహన లీలలఁ ॥

తమరొకటి బాడుడు.

నటు.— పరిహరణ కలిత వృత్తము.

కలరవయుతమై - గమగమ వలపై ।
సులలిత లతయై - సుమ సముదితమై ।
ఫలయుతమై స - త్ప్రకటితమై భా ।
సిలె వనతరులో - సిరులలర గదుఁ ॥

కాలాతిక్రమణంబయ్యె. నింకదడసిన సభాసదుల మనంబులకు నిరు త్సాహదాయకులమౌదుము. నాటక పాత్రలు మన గమనంబునకు వేచి యుండు, పోదమురమ్మ.

నటి.—యేమంతాతురము.

నటు.—యౌవ్వరాజ్యపట్ట భద్రుడైన పాండవాగ్రజుడు సభ నలంకరించు చున్న వాడు రమ్మ, రమ్మ.

[చెరియొక ప్రక్కగా నిష్క్రమింతురు].



శ్రీ

# సుభద్రార్జునీయము

## ప్రథమాంకము—ప్రథమరంగము.

---

ఇంద్రప్రస్థము.

ధర్మరాజ—భీమ—నకుల—సహదేవులాసీనులైయుందురు.

ధర్మరాజు. (౨ అనుబంధము).

చం॥ మనలసమస్తవేళలన మానుష చర్యల
 బ్రోచి ఘోరమౌ ।
వని నిరపాయతన్ మనిచి వారణ పట్టణ
 యౌవ్వరాజ్యమున్ ।
ఘనతర వైభవాన్వితముగా నొనగూర్చిన
 యట్టి దేవుడా ।
వనజదళాక్షుఁ డుత్తరము వ్రాయకుపేక్ష
 నొనర్చె నేలనో ॥

సోదరులారా, ఆ మహానుభావుడైన శ్రీకృష్ణమూర్తియొక్క దర్శనమైన ర్వక క్షేమమున్ వినక గడచెడిదినములు దుర్దినములుగదా. యిచ్చట కుశలంబులన్ దెల్పి ఆచ్చటి భద్రంబు లెఱుంగ నొక్క చారున్ బంప బ్రియత్నింపుడు.

నకు—అన్నా మరల జరాసంధుడేమయినను మధురాపురము ముట్టడించియుండవలయు. సంగ్రామ సంరంభంబున మనలన్ మరచియున్నవాడేమో నని సందేహము.

సహ—అందువలనగాదు. బావగారు పదహారువేలగోపకాంతల కౌగిళ్లయందు జిక్కి దేహమునే మఱచుచుందురు. యిక మనల మరచుటొక యెక్కువగునా.

నకు—సరిసరి! ఆ మహనీయుని చిత్తం బాకాంతలాగలంచుట తన సహోదరియైన సుభద్రా వివాహ ప్రయత్నుండై యున్నవాడో, లేక, భయంకర రణ కౌతుకుండై యున్నవాడో కావలయు.

భీము—ఏమీ? భయంకర రణము! జరాసంధుడు దండెత్తియున్నవాడా? అగ్రజా నాకాజ్ఞ యొసంగుము. నేబోయెద నిదే యీగదచే వానిశిరఃపాతం బొనర్చెద. నా పరాక్రమ మెఱుంగడా యాజరాసుతుడు పంపుము. యిదే పోయెద (నని పోబోవును).

ధర్మ—సోదరా యేల నీకీయాతురము భాగవతము మోక్షాంతంబుగను తారాశశాంకము శృంగారాంతంబుగను నెట్లు పరిణమించునో యట్లు నీమతము యుద్ధాంతముగా పరిణమించుచుండును. యే విషయ మనుకొన్నను యుద్ధము యుద్ధమని కలువరించెదవు. యిప్పటి విషయము జూడగా యమ్మహానుభావునిపై గల ప్రేమ నిన్నింత తొందర పెట్టుచున్నది. కానిమ్ము మన మనుకొన్నట్టు యోగ క్షేమములు విచారించుకొందము. చారా (యనిపిలచును — చారుడు ప్రవేశించునంతలో గదుడు ప్రవేశించును).

గదు—అఖిల రాజకిరీటమణి నీరాజిత పాదపద్మయుగళుండగు బావగారికి వందనములు (అని ధర్మజునకు నమస్కరించును).

ధర్మ—(ఱిచ్చపాటిచే సింహాసనమునుండి దిగివచ్చి కౌగలించి) కుమారా ద్వారకాపురమునుండి క్షేమవృత్తాంతము లెఱింగిసంవత్సరంబయ్యె నిప్పుడే చారునంప బ్రయత్నించుచుంటి నాహా శుభాగమనంబయ్యె!

(3 అనుబంధము).

కం॥ శ్రీ మహనీయ్యుడు కృష్ణుడు
కాముడు సాంబుడును హరియు గాలవముఖ్యుల్ ।
భామినులు మాతలాదిగ
క్షేమంబుగ నున్నవారె జెప్పుము వత్సా ॥

గదు—భవదీయంకృపారస పరిపూరితులకు క్షేమంబునకు కొదువగలదా! మాతా పితృ సుహృద్బంధు సోదరాదులెల్లరు భద్రసముద్రమగ్నులు యిచ్చట సర్వులకు కుశలమేకదా?

ధర్మ—శ్రీహరికరుణార్హుల నడుగనేల సర్వులుకుశలానవహులు.

భీమ—గదా మీఅన్నగారి కింతటి కొనివారమగుటకే మపరాధ మొనర్చితిమి? యిన్నిదినములా క్షేమలాభము తెలుగింపకుండుట యిప్పుడే మేమిదే యోచనయందుంటిమి; యింతలో నీవు జనుదెంచితివి లేకున్న నేనే రావలెనని ప్రయత్నించుచుంటి.

గదు—అదిగదా ప్రేమవాత్సల్యత!

నకు—మా బావగారు మరల చిన్ననాటి చోరవృత్తినవలంబించి మమ్ము మరచి యున్నవా రనుకొంటిని.

సహ—(చిఱునవ్వున) షోడశ సహస్ర స్త్రీ పరిరంభణానందల హరీనిమగ్నతుడీ యభావులగు మా బావగారికిప్పుడు దయగలిగె గాబోలు.

గదు—పెద్దవారిట్లు హేళనంబొనర్ప నేనేమివచింతు అర్జునుడేడి సభ నలంకరింప కున్నవాడు?

ధర్మ—నేడు త్రయోదశీ సోమవారముగదా పరమేశ్వరపూజా ధురంధరుండై యున్నవాడని వింటిని యిప్పుడే విచ్చేయును.

(అంతలో అర్జునుడు—తైరిక వేషముతో గాండీవాది సాధనములతో విశారదాది స్నేహితులతో ప్రవేశించి ధర్మరాజునకు పాదాభివందన మాచరించును).

ధర్మ—(కౌగలించి) యేమి యీ తైర్థికవేషము! ప్రయాణసన్నాహము

అర్జునుడు (౨ అనుబంధము).

కం॥ చోరహృతధేనుడై యొక ।
పారుం డరుదెంచియేడ్వ త్వరపడి యేనుక్ ।
మీరు శయనించు గృహ స ।
త్కారిత గాండీవముచట గైకొని వేట్కక్ ॥

కం॥ చోరుని హరియించియునా ।
పారుని ధేనువు నొసంగి వచ్చితి పూర్వం ।
బౌరయ మన మొనరించిన ।
తీరున నియమూర్బ మిటులు దీర్చ జనిమెదర॥

అప్పుడు ద్రుపదనందనయు మీరును యేకశయ్యాధిష్ఠితులగుటచే తీర్థయాత్ర లొనర్చుట కాజ్ఞకై ప్రార్థించెద.

## ధర్మరాజు (౫ అనుబంధము).

అర్జునా నీ వాక్యము ధర్మమార్గమే సంతసించితిగాని భూసురాపన్నివారణమునకై ప్రవేసించుట అపచారము గాను; పాపములేను; సూక్ష్మగాహివి ధర్మసూక్ష్మం బనుసరింపుము నీవో అతి సుకుమారుండవు సంచరించుటో ఘోర శరభకాసరసృగాల గండక భల్లూకాది భయంకర మృగకుల సంకులము కంటక పాషాణావృతము నిష్పానీయము నుష్పథావృతమగు ఘోరారణ్యమందు నియమమో వుపవాసము శీతోదక స్నానము ఫలాహారము లొనర్చుట గాన భూప్రదక్షిణంబుకన్నను గో ప్రదక్షిణం బొనర్చుటతి శ్రేష్ఠము నీ యుద్యమము మానుము నా వాక్యము ఉల్లంఘింపకుము.

అర్జు—అన్నా! మహర్షి ప్రేరితులమై బంధుమిత్ర సామంతాది సభాసమక్షమంబున మన మనుకొన్న నియమం బతి శ్రమకరంబని వర్జించినంత పాండవులు నియమ పరిపాలనంబునం దసమర్థులనునిందబొంది మాంస శోణిత క్రిమి కీటకాస్థి సంయుతంబీయ నిత్య దేహాభిమానంబుంచుట క్షత్రియ ధర్మమా? వంశ నియమమా? శ్రేయమా? బుధజనాదరణీయమా? పూర్వగతికతి పంథమా? యోచింపుడు. సమస్త ధర్మస్వరూపులైన మీ కెరింగింప సమర్థుడనా?

ధర్మ—అక్కటా! విధిలేను.

కం॥ ఎటులాజ్ఞ నిత్తు హరిహరి ।
ఘటికి సమంబౌను జూడ ఘంటకు మనుఃవో ।
క్కుటి గడచు నీవియోగము ।
హాటమొనరింపగ నికేమ టందును వత్సా? ॥

అర్జు—ప్రాకృత పురుషులా యింత పామరమునకు!

ధర్మ—దేహ ధర్మ మీశ్వరాధీనము నీవు మరల జనుదెంచు వరకు దేహధారినై యుందునో, లేదో హరికరుణ.

అర్జు—పాపము శాంతించునుగాక, అన్నయ్యా సంవత్సరమన నెంత ఒకదినము వలె గడపి జనుదెంచెద యోచించక నాకు శెలవొసంగుడు.

భీము—ధర్మశాస్త్ర సమ్మతమీ యర్జునుని పల్కులు అజ్ఞనివ్వుడు.

నకు-సహ—సత్యము. సత్యము.

ధర్మ—

సీ॥ గురుభక్తుడైన యీ నరుని రక్షింపరే
సురలార సత్య విస్ఫురణులార ।
కమనీయ్య సుగుణుడీ కౌంతేయు గావరే
చంద్రార్కులార నిస్తంద్రులార ।
తీర్థయాత్రారుడీ పారుని బ్రోవరే
మునులార యోగాబ్ధి వనజులార ।
ధర్మాధ్వగామి నా తమ్ముని నేలరే
తరులార ఫలపుష్ప ధరములార ।

గీ॥ మంగళంబు లొసంగరే మనుజులార ।
జయమొసంగరె భూధర చయములార ।
అతులితారోగ్య మొసగరే లతికలార ।
మాకిరీటికి మాటికి శ్రీకరముగా ॥

శుభంబున పోయిరమ్ము కుమారా మన క్షేమయోగంబు లారయ హరియానతి గదు డరుదెంచి యున్నవాడు చూడుము. నే నభ్యంతరావాసమునకుఁ జనియెద.

అర్జు—చిత్తము.

[ధర్మజ-భీమ-నకుల-సహదేవులు నిష్క్రమింతురు.]

అర్జు—(గదునితో) భావా యెప్పుడు విచ్చేసితివి?

గదు—ఇంతకు మునుపే జనుదెంచితిని.

అర్జు—సర్వులు క్షేమమా?

గదు—శ్రీహరి కరుణ. యిచ్చట?

అర్జు—ఇచ్చట సహా శ్రీహరి కరుణయే. ఆగత కారణము?

గదు—క్షేమ సమాచారంబు తెలుప హరియాజ్ఞచే నరుదెంచితి.

అర్జు—ఈ దినము సుదినము యోగక్షేమంబు లెరిగి సంవత్సరంబయ్యె శ్రీహరికి నేటికి కరుణగలెగదా!

గదు—ఇచ్చటనుంచి వచ్చినవెంట నే సత్రాజిత్తుయొక్క శమంతకమణి విషయమై రాబడిన యపనింద నివృత్తి యొనర్చుకొనుటకు ప్రయత్నము చేయుచుండి తత్కార్య నివర్తితుడై యిప్పుడొక్క సందిగ్ధకార్యా లంపటుండై యుండుటచే నాలస్యమునకు కారణమైనది.

అర్జు—సత్రాజిత్తెవరు? శమంతకమణి విషయకాపనిందయేమి?

గదు—ఆ విషయము సావకాశముగా వివరించెద.

అర్జు—పోనిమ్ము, యిప్పటి సందిగ్ధ కార్య విషయమైనను జెప్పెదవా?

గదు—వరాన్వేషణ పరుడై యున్నవాడు.

అర్జు—వరు డెవరికి?

గదు—పెండ్లి గాని కన్యకలకు.

అర్జు—ఆ సంగతి నాకును దెలియును. హాస్యంబులాడకుము నీవిదివరలో నిచ్చటికి విచ్చేసినపుడు నీతో గొన్ని సంగతులు తెలుసుకొనవలసియుండె మరచితి.

గదు—అప్పుడు మరచితివేమో యిప్పుడైన నేమి?

అర్జు—

కం॥ ద్వారకయందున మధురా ।
వారంబున దివ్యరూప వైభవ సుగుణ ।
ప్రారంభలైన కన్యక ।
లేరైనను గలరె దెల్పు హితమతి వత్సా ॥

గదు—(తనలో) మా కృష్ణమూర్తి నన్నియ్యెడకు బంపిన కార్య ప్రస్తావనకు తగు సమయ మచ్చియున్నది. ఒకవిధముగా బయలు పరచెద (ప్రకాశముగా) కన్యకలెందుకు?

అర్జు—అప్పుడు నీవన్నట్టి పెండ్లికాని పురుషులకు.

గదు—వుండెను, కన్యక లెవరికి గావలయు?

అర్జు—ఎవ్వరికైననేమి? అడుగగూడదా?

గదు—కన్యక లెచ్చట నున్నవారిని విచారించవలశిన యగత్యము నాకేమియు లేదు, నాకగత్యములేదు.

అర్జు—నీ కగత్యము లేకున్న మరియొకరి కొరకైనఁ దెలసియుండెనో.

గదు—విచారించవలయునని నాకెవ్వరు చెప్పియుండలేదు

అర్జు—చెప్పకున్నను పరోపకార పారీణులగు నీబోటివారలట్టి సత్కార్యములకు ముందంజ వేయుచుందురు.

గదు—(నవ్వి) నీవు చెప్పకున్న నాకు దెలియదో నీవు గాక మరి యింకెవ్వరికి?

అర్జు—అట్లనే యనుకొని తెలియజేయుము.

గదు—అభినవ మనోహరాకారుండగు నీకు తగు కన్యక లెందైనఁ గలరే! గాన మనసు భద్రంబుగా నుంచుకొనవలసినదే.

అర్జు—ఇదే మిట్లనుచున్నావు? నామనస్సు భద్రముగా నుండక పలుపోకలఁ బోవుచుండు ననుకొంటివే?

గదు—పోనిమ్ము. భావగారూ! తాము ప్రద్యుమ్నుని పరిణయమునకు వచ్చి యుంటిరి గదా!

అర్జు—వచ్చియుంటిని. యేల?

గదు—వసంతోత్సవము నాడు తా మెందుంటిరో?

అర్జు— నేనడిగిన ప్రశ్నకుమాత్రము జవాబులేదు. యేవేవియో పూర్వరామాయణంబు లెత్తుచున్నావు.

గదు— అటుకాదు, మాపెద్ద వదినెగారైన రుక్మిణీదేవిగారు వధూవరుల నిమిత్తము వసంతోత్సవ మంటపమునకు వచ్చుసరికే తాము చేయుచుండిన కార్యమేమి? అప్పుడు తమ మనస్సు భద్రముగానే యుండెనో?

అర్జు— ఓహో! నీ చెల్లెలు సుభద్రతో సరసములాడుచుంటి నంతయేగదా.

గదు— అట్లయిన మా సుభద్రను నీవు జూచియే యుందువు.

అర్జు— ప్రద్యుమ్నుని పరిణయ మప్పుడు జూచినదే మరల జూడలేదు. అప్పుడు పదుమూడు సంవత్సరముల వయస్సుండెనోపు.

గదు— బావా! యేమి మాయలివి? క్రొత్తగా చెప్పెదవే! మాయన్నగారి యౌవరాజ్యాభిషేకమై యొక సంవత్సరంబయ్యె. అప్పుడు మా సుభద్ర యిచ్చటికి వచ్చియుండలేదో? ఆరక్షణ విరామమైన నేమియో పని కల్పించుకొని, అంతఃపురంబునకరిగి యామెజూచి వచ్చుచుండలేదో? నీవామెపై పుష్పగుచ్ఛము విసరివైచినప్పుడు నీకు తెలియక నీవెంటనే వచ్చుచుండిన నేను చూడలేదో? మరల మా సుభద్రను చూడలేదనెదవు. ఇప్పుడు పదునైదవ యేడు నిండుచున్నది. నీచిత్తమంతయు మా సుభద్రపైన నుంచుకొనియే నన్నిట్లు ప్రశ్నలు జేయుచున్నాడవు.

అర్జు—(చిరునవ్వున) పట్టాభిషేకమున కెందరో సుందరీ తిలకము లరుదెంచి యుండిరి. అప్పుడు మీ సుభద్రను జూచుచుండు పనియేనా నాకుండునది?

గదు:— మా సుభద్రను మాత్రమే జూచుచున్నానని నే ననుకొంటినిగాని, యింకే సుందరిపై నీ కన్నుబార యుండినది నే నంతగా గమనింపలేను.

అర్జు— నీ హాస్యోక్తుల కేమిలే? మీ సుభద్ర సంగతి నాకెరుకపరుప వలయునని యే నీవు మనసు భద్రము అని ధ్వనిగలిగించియున్నావు. నీ నిశ్చయ మంతయు దాచక వివరింపుము.

గదు— ఇంక దాపనేల? మాకృష్ణమూర్తి గారి యాజ్ఞచే యీసంగతి నీకు తెలియ పరచుటకే యిప్పటి నారాక.

అర్జు— ఏమెరిగించితివి?

గద—బలరామన్న దుర్యోధనున కొసంగవలెనని యోచించుచున్నాడు. పెద్ద వారి యిష్ట మనుసరింతమన్న మా సుభద్ర నీయందే మరులు గల్గి ప్రతిదినము నిన్ను తన పతిగా నొసగ్మని గౌరీ శంకరుల భజించుచున్నది. ఈ సందిగ్ధమునందు జిక్కి మా కృష్ణమూర్తి యోచించుచున్నాడు.

అర్జు—అట్లు నన్ను పతిగా యొసగ్మని గౌరీ శంకరుల నర్చించుటయు, మీ సుభద్ర నాయందే మమత గల్గియుండుటయు, స్పష్టముగా నీకెట్లు తెలియును?

గద—ధర్మజు యౌవరాజ్యాభిషేకమున కామె యచ్చట కరుదెంచియున్నపుడు నీ రూపమును తానే రహస్యముగా చిత్రించి తన యంతఃపురమున నుంచుకొని నిన్నే దిలకించు చుండుననియు సఖీజను లెవ్వరు లేనప్పుడు కేళీ శుకముచే నీ పేరే బలికించుచుండుననియు, యీ సమాచార మప్పుడప్పుడు మా పెద్దవదినెగారు రుక్మిణి మా అన్నగారికి వివరించుచుండిరనియు నే వినియున్నాను.

అర్జు—కానిమ్ము. శ్రీకృష్ణమూర్తియొక్క నిశ్చయాభిప్రాయమేమి? నాకు తెలియచేయుమన్న ముఖ్యాంశమేమి?

గద—యోచించి తుదకు నీకే యొసంగవలెనని నిశ్చయించియున్నాడు. నీవు తీర్థయాత్రకు వెడలి సంవత్సరాంతమున సన్యాసి వేషముతో ద్వారకాపురమునకు జనుదెమ్ము. పిమ్మట శ్రీకృష్ణమూర్తియే గలడు.

అర్జు—సన్యాసివేషము అదెందుకు?

గద—యతులను జూచె నేని బలభద్రునకత్యంత విశ్వాసము. నీవచట చేరు సమయమునకు చాతుర్మాస్య ప్రారంభించును. ఆ నెపముచే రెండు మూడు మాసములందే యుండవచ్చును. సమయమువేచి బలభద్రునకు తెలియనివ్వకుండా నీవు క్షత్రియ విధిగా సుభద్రను వరియింపవచ్చును. కార్యము మించినంతట యెవరేమి చేయుదురు?

అర్జు—శ్రీకృష్ణునకు నాకొసంగు సంకల్పమేయుండిన తక్కిన యాదవులు, కౌరవులు నాకొక లక్ష్యమా?

గదు—మాఅన్నగారు నీకెరిగింపు మన్నదంతయు, వివరించియున్నాను. మాఅన్న గారికి, నీవువిన్నవించు వాక్యంబు లెవ్వియేనిగా గలిగిన విమర్శింపుము.

అర్జు—

గీ॥ నేను తీర్థయాత్రి బూనిన గతిదెల్పు
వత్సరంబునకును వచ్చుననుము ।
పరమభక్తితోడ బ్రార్థించి వందనం ।
బును నొనర్చె ననుము జనుము పురికి ॥

నేడును రేపును నిలచి అగతాయాసనివృత్తి యొనర్చుకొని వెళ్లుము, సత్రాజి ద్విషయం బెరిగింతువు రమ్ము.

[అని నిష్క్రమింతురు].

[అవనిక దిగజారును].

## రంగపురోభాగము—హస్తినాపట్టణ ప్రాంత్యము.

## గార్గ్యముని ప్రవేశము. (౬ అనుబంధము).

బలభద్రుడు నన్ను వరనిశ్చయార్థ మీయ్యెడకు బంపి యున్నవాడు. దుర్యోధ నునకట, సుభద్రనట, యొసంగుదురట, యీకార్యము సాంగమౌనా. నేనుద్వారక నిర్గమించినది విషఘటికలయందు యీదుర్మార్గులు నన్నేమి యొనర్తురో నను భయము విషఘటికలైనను వృషకాలము శ్రేష్ఠమని నామతము కానిమ్ము. వర నిశ్చయార్థ మరుదెంచిన నన్నేమి యొనర్తురు, క్రూరకేళియపడుచున్నాను. యేమో సుష్టులు. యీసంగతి అర్జునునకు దెలసెనేని యిచ్చెదనన్నందుకు బలరాముని నిశ్చయ మొనరింమకొని ఇచ్చినందుకు నన్నును, వొప్పుకొన్నందుకు దుర్యోధనుని పీడ విడపించును. యేమో పోయెద అయినది కాని చూతము.

(అని నిష్క్రమించును).

## ప్రథమాంకము—ద్వితీయరంగము.

### హస్తినాపురము.

దుర్యోధన-కర్ణ-శకునులాసీనులైయుందురు.

దుర్యో—కర్ణా! జూచితివే అబలభద్రునకు నాపైగల కరుణాకటాక్షము.

సీ॥ మేనత్త కొడుకును హీనునిగానెంచి
నాకొసంగదలంచె నాతినిప్పుడు।
భోగధురంధర భాగధేయుడగాన
బాళినాపైగల్గె బలునకెలమి।
యెంతరూపంబున్న నెంతశౌర్యంబున్న
ధనవిహీనుని జీవితంబు దగునె।
కరివైరివిక్రమ క్రమశౌర్యుడై నాకు
చెలినివ్వకుండిన చేటుగల్గు।

గీ॥ ననుచుయోచించి మదినెంచి యనుగమించి।
పొంచిరప్పించగ దలంచి భూసురాభి।
వర్యునంపించె మనమతి భాసురముగ।
ఫలపదార్థాదు లంపింప వలయుత్వరగా॥

గార్గ్య—రాజేంద్రా! మీరందరు శుభద్రవ్యంబులు గైకొని, శీఘ్రముగా తప్పక రావలయు.

దుర్యో—యీసంగతి పాండవులకు తెలియునా.

గార్గ్య—తెలియదు.

దుర్యో—నాకొసంగుట బలరామదేవునకేనా కృష్ణాదులందరికీ సమ్మతమా?

గార్గ్య—నేనిచ్చటికి వెడలుటకు ముందుదినము రాత్రి వారందరు, నొక్కచో జేరి యుండిరట. నన్నిచ్చటికిఁ బోయిరమ్మన్నది బలరామదేవు డొక్కడు మాత్రమే! రాజేంద్రా! నీకొసంగుట కెవ్వరికేమి యోచనగలదు. సర్వులు సమ్మతించియే యుందురు. త్వరగారావలయు.

దుర్యో—నాకింకేమియు యోచన లేదు గాని తొలినుండియు సుభద్ర నర్జునునకే యొసంగెద మనుచుండిరి. ఇపుడీసంగతి నర్జునుడు వినెనేని పరిణయసమయ మందే తెంచి గాండీవముక్త బాణ శిఖలు వివాహమంటపంబు నిండించునని యోచన.

గార్గ్య—అందుకు మీరేమి తక్కువైనవారా? పూరకుందురా.

దుర్యో—నే ననునది చేతగాక కాదు. శుభసంగము యుద్ధరంగముగా మారు నేమోనని యోచన. అయిననేమి?

చం॥ రభస పరాక్రముండయిన
రాధ తనూభవుండు సింధుభూ
విభుడగు బావయుండపటు
భీమబలుండగు మామయుండనా ।
రభట కఠోర విద్విషశిర
స్తటికృంతనః జేసు ఖడ్గినై ।
సభదిరుగాడు చుండగన
జాలునె యర్జును డారయచ్చటన్

కర్ణు—(లేచి)

మ॥ భళిరే మెచ్చితి నేను గర్జనము మ
మద్బాహాగ్ర జాగ్రన్మహో ।
బ్రిళయోద్దండక పర్ఘిశూలసమ శ
శ్వత్ఖడ్గ ధారాహతిన్ ।
గళభగ్నం బొనరింతు నర్జునుని నీ
కల్యాణమం దారనీ
ప్పలుకుల్ మెచ్చితి శూర ధర్మమిది భూ
పాలాత్మజా జూడగన్ ॥

శకు—(లేచి) మీకెందుకింత ప్రయాస. గాంధర్వ. తిరోధాన. శాంబరీ ప్రముఖ మదీయ్యమాయా బద్ధుడై యర్జునుడు భస్మీభూతుడు గాక నిలచునా. సమరమేటికి ? శౌర్యమేటికి ?

గార్గ్య—దుర్యోధనా నిక్కము నీవు వివాహమాడెదవు.

కర్ణు—వివాహ మాడకున్న నేవిడతునో మత్ప్రదరముల భస్మీభూత మొనర్చి యర్జునుని వివాహసాంగము గావించెద.

దుర్యో—తీర్థయాత్రకై వెడలినాడని దెలసె.

శకుని—యెవరు ?

దుర్యో—అర్జునుడు.

శకుని—యేలనో ?

దుర్యో—వుండలేదా! పంచమహా పతివ్రతయైన మనద్రౌపతి ఆ సతికొరకై నారదునిచే వారైదుగురు నియమింపబడి యుండుట

శకుని—అట్లేజరిగియున్నదేమో, సరిసరి తెలసె చంపితినర్జునుని.

దుర్యో—(ఆతురముగ) అదెట్లు ?

కర్ణు—అదట్లే.

శకుని—తీర్థయాత్రకు ఒంటరిగా వెళ్లును. సరే చచ్చినా డనుకొనుడు.

కర్ణుడు—(కోపమున) యేమీ నిన్నను కోవలసినదే చచ్చినాడని; గతించినాడని; మృతిజెందినాడని; డింకకొట్టినాడని.

శకుని—(ఈర్ష్యగాని) దుర్యోధనా కర్ణు డిట్లనెను.

కర్ణు—భీమ రణరంగమున ముఖాముఖి గదసి కనకపుంఖిత మార్గణ ధారా పాతంబొనర్చి, ఖండిత, మర్ధిత, విఘటిత, విభ్రంసిత, ధ్వంసిత, రథ, ధ్వజ కోదండ సైన్యమయంబు జేయకుండ మాయమట; యేమిమాయము! నీమాయము; ప్రతిపక్షోపాయము; రణపాథేయము; గుణాంతరాయము; దురభిప్రాయము; చాలు. ఛీ నోరుమూయుము.

శకుని— తీర్థయాత్రకై వెడలిన వాడెచ్చట విశ్రమింపడా. నిద్రబోపడా యేమిమాటలివి కర్ణా!

కర్ణ—నీమాయచే వాడు నిద్రపోవడుకాని నిన్ను మాత్రము దీర్ఘనిద్ర నొందించును

దుర్యో—కర్ణా దయయుంచుము. కోపగింపకుము. మామా కాని చెప్పుము.

శకు—కర్ణుడు కోపగించుకొనకున్న నేనొక్కమాయబన్నెద

దుర్యో—ఏమిమాయ?

శకుని—వింధ్యారణ్య ప్రాంతమున నేగదా మన హలాయుధుని తమ్ముడు విద్యున్మాలి యున్నవాడు.

దుర్యో—ఔను

శకుని—అంతయు చెప్పెదరమ్ము. పిదప నిస్సందేహము నిరభ్యంతరము.

దుర్యో—మునీంద్రా తాము జనుడు త్వరలో శుభద్రవ్యంబు లంపించెద.

(అందరు నిష్క్రమింతురు)

గార్గ్య—(ముందరికివచ్చి) యిటులేకున్న నీగురాత్ములకు దుష్టచతుష్టయులను పేరుగలిగెనా కర్ణుడొక్కడు మాత్రము. నిజధర్మాను వృత్తిమాటలాడెన ది పుట్టుకమహిమ

మ॥ అర్ణవమేఖ లావలయితాబ్జభవాండ
ధరిత్రి నెల్లనీ
కర్ణుడెయేల జాలు ఖలకౌరవనాథుని
చెంతజేరుటన్ ।
దుర్ణయభాన మబ్బెనతి దుష్ట తలంపులు
మీరెనక్కటా ।
వర్ణవిహీనురీతినిట వర్తిలనయ్యె
పురాకృతంబునన్ ॥

పోనిమ్ము నాకథనాయది వరనిశ్చయార్థమై జనుదెంచిన నన్ను గౌరవించుటో బహుమతు లొసగుటో యాదరించుటో హరిహరీ గంధర్వ నగరము — శశ విషాణము. కులనాశకులు. వంశదూషకులు వారన్న ప్రతీకారం మాడుట నిక్కువము. వివాహమబద్ధము. నేను విషభుడియలయందు పురంబు

నిర్గమించినను పునః కాలమగుటచే నీదురాత్ములు నన్నేమియు నర్పక విడచి యున్నవారు (పునః కాలంతు గార్గ్యః) అనునాయుతమే ప్రయాణములకు సరియైనది. నాప్రాణములు నేనుదక్కించుకొన్నాను మర్యాద విహీనుల చెంతకు బంపినందుకు బలరాముని తప్పా? వప్పుకొని వచ్చినందుకు నాతప్పా? (విప్రాః పశ్చాద్బుద్ధయః) యిప్పుడేమనుకొన్న నేమి బ్రయోజనము.

[అని నిష్క్రమించును]

—అవనిక బడును—

## ప్రథమాంకము తృతీయరంగము.

### గంగానదీతీరము.

విశారదుడు. అర్జునుడుబ్రవేశము.

అర్జు—

గీ॥ మంగళతరంగ సురసంగ మదనజనక
పాదసంభూత దివ్యాంగ పాపభంగ।
హరజటారంగ మునిమాన సాబ్జభృంగ
గంగ గనుఃపూః సఖాపాంగడంగదరమే ॥

విశారదా కమల కుశేశయాది పుష్పసౌరభ్యము మనంబున కానందం బొందించుచున్నది. అనవరతమెడతెగని తరంగము లాకసంబు నంటుచున్నవి తుమ్మెదలు ఝుంఝుమ్మని బాడుచు కమలములపై వ్రాలుచున్నవి. కలహంస కారండవ జలకుక్కుటాది. పక్షులకలకలము హాయిగొల్పుచున్నది. ఆహా యీనదీజలంబులఁ స్నానమాచరించి గంగాభవాని నర్చింతమురమ్ము

విశా—చిత్తము

(అర్జునుడు విశారదుడు చేతులు జోడించుకొని.)

(౨ అనుబంధము).

అర్జు—విశారదా! నేనిచ్చట జపంబొనర్చుచుండెద, నీవు ఫలపుష్పంబుల గొని తెమ్ము

(విశారదుడు ఫలపుష్పములకై నిష్క్రమించును)

(అర్జునుడొక రసాలవృక్షముక్రింద జపమొనర్చును)

(అంతరావనిక దిగజారును)

(రంగపురోభాగము మరియొకప్రక్కనుండి కనకపాత్రతో ఉలూచి ప్రవేశించును)

(౨ అనుబంధము)

ఆహా! యేమి నా పురాతనమో మణికంధరుడు తెల్పిన వృత్తాంతం వినిరిగినది మొదలాయర్జున భూపాలుడే వరుడు కావలెనని జింతింతును. దేవార్చనాగు లాచరింతును. భూసురులను భోజనంబొనర్పింతును. వుపవసింతును. (కంచుకములోనున్న చిత్రపటము దీసి చేతియందుంచుకొని) యీ చిత్రపటమే దైవమని భావింతును. యేమి ప్రయోజనము? ఇంద్రప్రస్థమునకు బోదునా. యెట్లు? యీవిధి అంతసాహసమా. ఛీ స్త్రీజన్మమేమిటికి మగవారికి తమకోర్కె దెలియజేయుట స్త్రీలకసమంజసము. నామనోహరుడిచ్చటికేమిటికి రుదెంచును. తలచి, తలచి, వేసారి గుప్పెక్కుల్లు మ్రింగి మోహాతిశయముచే నుబుసు కుచములనదిమి నా మోహము నేనే అర్పనయింతును (లోపల కల కల ధ్వని యాలకించి) యేమి? యీ శబ్దము. యెంత మోసమాయె హాటకేశ్వరాభిషేకమునకై జలంబులకై గొని యను వాంఛ చేనరుదెంచితిని. యీ నదీతీరంబున నెవ్వరో మానవులు సంచరించుచున్నట్లున్నది. మానవులు రాగద్వేషయుక్త మదోన్మత్తులు. వుత్పాతంబు లేమి సంభవించునో. ఆటబోకున్న ప్రదోషకాలాతీతంబగును. అయినచో పూజాభంగం బొనర్చు దోసంబబ్బు ప్రదోషకాలాతీతాతురభీతిచే సఖీజనుల సహా పిలచుట మరచితి. కాని నాయదృశ్య ఘటికాప్రభావమున నితరుల కగుపడకుండ జలంబులకై యేగెద గాక.

(వెనుక ఆననిక నెత్తబడును)

(ఊలూచి జపంబు సల్పుచున్న అర్జునునిఁ గాంచును)

(దాఁచి మాయచాలించి పలువ్యాసుగాంచి తదీయమోహనాకృతి కన్నులకు మిరుమిట్లుగొల్పిన నులికిపడి)

కం॥ మారుఁడొ హరుఁడో యీ ।
సుకుమారుడు విద్యాధరకుమారుఁడొ శశియో ।
భూరమణుఁడైన పార్థుఁడొ ।
యేరీతిఁ దాలు దాన నీమోహముచేఁ ॥

(ఈ అనుబంధము)

మ॥ హరుఁడా కాదు సురేంద్రుఁడా భ్రమసెఁ
శ్రీయజ్ఞాత్ముఁడా కల్లయా ।
సరసీజోద్భవుఁడా హలికి శశియా
సందేహ మామాగుణా !
సరిలేదంబుజమిత్రుఁడా పొసఁగి
దీసంపూర్ణ తేజుండుసుం ।
దర జంభారి కుమారు డర్జున మహీ
శ్వరేయుఁడే జూడఁగాఁ ॥

సుధాకరసమాన వదనప్రసన్నమా. సంపంగిపువ్వుతో తులతూఁగు నాసిక సౌకుమార్యమా. శంఖ దృశ కంధర సుందరమా. కరితుండభుజాదండాడంబరంబా మీసాలలోని నవ్వులవెన్నెలలా. యితరుల నమ్మ్రజాల. నమ్మ్రజాల. భూసతీపాలన కళావిలాసుండగు అర్జునభూపాలుఁడే యీతనని సంశయము గల్గుచున్నది. యెందుకు నామనంబిట్లు పరువులు వారుచున్నది? కానిమ్ము. పరమసమాధి నిష్ఠచే విముక్తోత్తరీయుండై యున్నవాడు. నా మనోహరునకు వెన్నునమచ్చగలదని వినియున్నాను. జూచెద (అని వెనుకభాగంబునకరిగి మచ్చను గాంచి ముందరికి వచ్చి) యిక నిస్సందేహము. ఆహా యీతనిపటము నా చెంతనుండియు, నింత యనుమానించితిని. చామనిచాయ, బవిరిగడ్డము, వెన్నునమచ్చ. హౌరా

నా ప్రాణేశ్వరుండైన విజయ భూపాలుఁడే. అటులేకున్న యులూచి తానుకోరిన పురుషునిగాక నన్యులఁజూచిన మాత్రముననే మోహించునా? శ్రీమదాదిశేషుని పుత్రికయై నీచవృత్తికి బాల్పడునా? హాటకేశ్వరార్చనా ఫలంబు నేఁడు సిద్ధించె.

సీ॥ ఈ మోహనాకారు నెలమిఁ గూడక యున్న
తరళాక్షి స్వర్గాభ తనువ దేల।
యీ గంధగజయాను కౌఁగలింపఁగ లేని
కరియాన వక్షోజ గరిమ మేల।
యీ శశాంకాననునితో శయనింపని
కమలాక్షి జన్మంబు గాంచ నేల।
యీ మనోహరయాను వీక్షింపకుండిన
చెలియ లోచనముల కలిమి యేల।

గీ॥ ఔర యీసొంపు నీ పెంపు నీ రమణత।
నీరమోయారంబు నీ చెల్వు నీ మెఱుంగు।
నీ మహాశ్చర్య రూపంబు నెన్న దరమె।
మనుజునికైనను నిర్జరవరునికైన॥

పూర్వసుకృత ఫలవిశేషమా! భువన మోహనశృంగారరసమా! నిజదాస హృత్కళంక హరణశంకరకృత మోహన విద్యామహాత్మ్యమా! మందాకినీ స్నానఫలానుభవ సమయమా? హాటకేశ్వరార్చనాతపః ఫలితమా! ఏమి రూపము. ఏమి శృంగారము. దర్శనమాత్రముననే స్పర్శసుఖంబు జనించె. స్పర్శసుఖంబలనద నింకెంత సుఖానుభవమో? అయిన నేమి ప్రయోజనము

కం॥ వ్రత పరిపూర్తిగ నా ప్రియు ।
పతినిఁ గనుగొంటి నాదు పట్టణమునకుఁ ।
యితనిఁ గొనిపోవగనే ।
మతముఁ రాదయ్యె నింక మాయ యొనర్తుఁ ।

సంతసించుచున్నదానను వాకోర్కెసెరవేరినగదా సంతసించవలయు చూడకున్న సెంతప్రియోజనమో చూచియు నంతియే. సంభాషించుటకు జపంబొనర్చుచున్న వాడు. తిరోధానమాయచే మాపురంబును జేర్చదగాక.

[అర్జునుని సమీపించును]

(అననికబడును)

ప్రథమాంకము సమాప్తము.





శ్రీ

# సుభద్రార్జునీయము

## ద్వితీయాంకము—ప్రథమ రంగము.

భోగవతీపురము—ఉలూచి యంతఃపురము అర్జునుడు హంసతూలికపై గూర్చొని జపము సల్పుచుండును.

ఉలూచి ప్రక్కన నిలచియుండి ముందరికివచ్చి

(౧౦ అనుబంధము)

సీ॥ మదనసంగర కళామధుర సాస్వాదన
కిదిగదా తగువేళ యిందువంశ।
కుచకుంభ శిఖరాగ్రగురు నఖక్షతమున
కిదిగదా తగువేళ కదనవిజయ।
అధరబింబామృతానంద వైభవమున
కిదిగ్గదా తగువేళ మదన మదన।
ఘనసారసౌగంధి కాలేపనంబున
కిదిగదాతగువేళ యిందువదన।

గీ॥ కపటిజపమేడ నీవేడగలియుటేడ।
చాలుచాలును కనువిప్పు కేళిసల్పు।
రమ్మికాలింపు దయజూడు రాజతనయ।
మోహనాకార ధీరసంపూర్ణమార॥

యీరాజకుమారుఁడు జపమొనర్చుచు ప్రపంచభ్రాంతివిడలి యచంచలుండైయున్నవాడు మేల్కొల్పుట మహాదోషంబని పెద్దలు వచింతురు. ఇతని కొలఁక బొడముననరకు నిచ్చట విశ్రమించెద. (విశ్రమించి నిద్రించును)

(అర్జునుఁడు కనుదెరచి ఆశ్చర్యమభినయించి లేచి)

ఏమిచిత్రము! యీయంతః పురంబెక్కడిది యీతల్పమేమి? యీకర్పూర ధూప ధూమపటిలీ సుగంధ బంధురంబేమి?

సీ॥ గంగానదీతీర శృంగారసైకత
స్థలిబాసి పాన్పుపై నిలచుటేమి।
శుకపికకుహుకార శోభితంబగువనీ
స్థలబాసి గృహమందు నిలచుటేమి।
సరసిజపరిమళ భరితంబుబోయి
కర్పూరగంధ సౌరభ్య కరమిదేమి।
పుష్పపరాగస ద్వ్యాపితంబేగియీ
స్వర్ణధూళీ గర్భ సౌధమేమి।

గీ॥ జాహ్నవీ తీరమెక్కడ సౌధమెచట।
చిత్రమాయెను జూడ పవిత్రుఁడైన।
సవ్యసాచిని నేగానో స్వప్నమొకొ।
గంగలోస్నానమొనరింప గల్గుఫలమొ॥

విశారదాది నాస్నేహితులెందు జనియున్నవారో (అని వెనుకప్రక్కన శయనించి యున్న ఉలూచినిగాంచి)

శా॥ ఔరాయీనగుమోము సోముతెరగా
రారాతి వాల్చూపులున్।
పైరాగుబ్బల యుబ్బుగాంచ పైపై
రాధ రోష్ఠంబు వ

హ్వారే కన్యామరీతి భాతి వహావారే ।
దివ్య నాసంబు మ ।
ఝ్ఝూరే క్రీడ పెంపు సొంపుగల దీ ।
సాధ్వి మహం బెవ్వరో ॥

యీసతీతిలకం బెవ్వరో నిరూపించుచున్నది. మదనధనుర్జ్యాముక్తాసాయకమా కాదు. నీలతోయదమధ్య విరాజిత విద్యుల్లేఖయా. కాదు కాదు. శరన్నీరజారిక లయా ఆదియుగాదు. భువనమోహనశృంగారమూర్తిభవంబు కాబోలు యేమి యీ తనూవిలాసము.

సీ॥ ఔరఔన్నెరివేణియంబుదంబుసునవ్వ
కడద్రోచుమధ్యంబు కరివధూటి ।
రాకాశశాంకుని రాకొట్టువదనంబు
దిగద్రోచుమధ్యంబు మృగస్త్రపాలు ।
కుచకుట్మలముస్వర్ణ కుంభంబులకుగొట్టు
తాత్సారమొసరించు తాల్మిధరణి ।
గరువంబుగోను దేహ కాంతిగాంగేయంబు
పరిహాసించుగళంబు పంకజమును ।
మూరునారినిగేరు నూగారుసౌరు
కదళికాదండ విదళనక్రమతరోగు ।
కలగవోల్లసమాధురి గులుకు పలుకు
బాలనేలీలస్పృశియించె పద్మభవుడు ।

మసిజనహృదయ ధైర్యలతాలవిత్రంబగు నిట్టి శృంగారం బెచ్చటనైన గలదే. యీకాంత ముఖలక్షణంబులు గన్న విరహవేదనాని మగ్నమానసయై యున్నట్లు స్పష్టపడుచున్నది. యీసతితో రతిక్రీడసల్పినగదా యదృష్టంబుఫలించు. సకల మహీవలయంబునంగల చెలువలకీ చెలువంబుగలదే నామనంబునందేలకో విరహముద్రట్లాగుచున్నది. మదిచిక్కబట్టన సాధ్యంబైయున్నది. బలిమిబట్టి రతు

లదనుపునా (అని వెనుకకు రెండడుగులిడి) (యోచించి) హాపాతకీ! నీచా పాండవాపశదా యెట్టిదుష్కృత్యంబునకు బాల్పడుచున్న వాడవు. ఔరా! నీవ్రతం బేగతి బట్టించితివి. నీదీక్ష యేపక్షంబున వైచితివి. నీపరనారీ భ్రాతృత్వంబే ధాత్రిగా విడచితివి. మోహావశమున కన్నుగానక తీర్థయాత్రానియమంబు విసర్జించి వంటరియైనొక్క వాల్గంటిగా గనిన మాత్రంబుననే యిట్టిగతి బట్టితివా? యీ సతిగ్రుహిణియో వారాంగనయో బ్రాహ్మణియో నీచజన్మయో తెలియంగక తార తమ్యంబు పరీక్షింపక కులగోత్రంబులు విచారించక నావివరుస లెఱుంగక మోహ పిశాచ గ్రస్తుండవైతివే చాలు చాలు యోగ్యత యిగమడించుచున్నది. కొంచము నిదానించుము. అన్నియు విమర్శయగును. యీసతికదలుచున్నది. విచారించెద.

ఉలూ—(కదలును)

అర్జు—మానినీ (ఉలూ లేచును)

అర్జు-

కం॥ ఎవ్వరిదానవుభవనం।
బెవ్వరిదీభువనమునకు నెయ్యదిపేరా।
యివ్విధినుండెద వేటికి
జవ్వనినాతోడబల్కు సంశయపడకగ।

అర్జు—నీనామధేయమేమి?

ఉలూ—ఉలూచియందురు

అర్జు—మానవతీ మణీనీ వెవ్వరు?

ఉలూ—తమబహిఃప్రాణమును

అర్జు—ఓహో! అంతఃప్రాణముగదా

ఉలూ—అదియు

అర్జు—సరియుండనిమ్ము. యీపురినామధేయంబెయ్యది? యిందునకధిపతియెవ్వరు

ఉలూ—నిజసహస్ర ఫణాగ్రలీలాకందుకీకృత బ్రహ్మాండ భాండుడా ఆదిశేషభు జాపరి పాలితభోగవతీ నామనగరము

అర్జు—అట్లైన యిదినాగలోకమా?

ఉలూ—ఔను

అర్జు—యీసౌధమెవ్వరిది?

ఉలూ—తమదిగాదా

అర్జు—నాయగియా అడెట్లౌను?

ఉలూ—నీనే తమదాననైన నాసొధబింక నెవ్వరిది?

అర్జు—(తనలో) యేమిచిత్రముగానున్నది అంతకంతకు సమీపించుచున్నదే కాని
 మ్మ (ప్రకాశముగా) నేనిచ్చటికెట్లువచ్చితి?

ఉలూ—తిరోధానమాయచే దెచ్చితి?

అర్జు—కారణ మెయ్యది?

ఉలూ—యేదేని యొకకారణముగల్గియే

అర్జు—యేమికారణము?

ఉలూ—శరణాగతోద్ధరణము

అర్జు—భయపడకుము. అభయమిచ్చితిని యిక దెల్పుము. కారణ మెయ్యది?

ఉలూ—ప్రాణరక్షణవిచారణము

అర్జు—ప్రాణమునురక్షించెద కారణ మెఱిగింపుము

ఉలూ—మనోవ్యాకులవిదారణము

అర్జు—మున్నే యభయ మొసగితి నికమనోవ్యాకుల నివారణమేగదా! కారణము
 వచింపవేల?

ఉలూ—నిక్కముగా ప్రాణరక్షణ మొనర్చితివిగదా!

అర్జు—నిజము ప్రాణభయ మెవరివలన?

ఉలూ—ఇంకవచించెద ప్రౌఢాంగనా హృదయవిదారునివలన

అర్జు—స్త్రీజనహృదయ విదారకుడెవ్వడా దురాత్ముడు

ఉలూ—త్రిలోక మోహనాకారుడు

అర్జు—(తనలో) నామనస్సునకు వచ్చియున్నది. తెలియనివానిరీతి నటించుచు నీసతి
 తోనే యనిపించెద (ప్రకాశముగా) నాకర్థముకాలేదు.

ఉలూ—జిష్ణుచైత్రధ్వజకుమారుడు

అర్జు—ఓహో మారుడా! అనంగుడు నిన్నెట్లుబాధించె

ఉలూ—అనంగుడుగాను శుభాంగుడే సరూపుడై యెదుటనున్నవాడు

అర్జు—నేజూడలేదు. నాకగుపడలేదు. యేమిచేయుచున్నవాడు?

ఉలూ—మోహవిభ్రాంతిచే ప్రార్థించుచున్న యువతిని మాటలచే దృప్తిపరచుచు
 న్నవాడు.

అర్జు—యేమిమాటలివి నీపలుకుల కర్థ మొనర్చుట కసాధ్యము అభేద్యము

ఉలూ—రాజ కుమారుడవు శత్రుజనమారుడవు రూపజితమారుడవు పాండ
 వవంశోద్ధారుడవయ్యును నాప్రార్థనోక్తులకర్థంబు గాదన్న నే నేమ నివచింతు

అర్జు—చిత్రము నేనర్జునుడనియు పాండవ వంశోద్ధారుడనియు నీకెట్లు దెలసును?

ఉలూ—దేవా! నేనెన్ని విధముల బ్రార్థించినను నాహృదయ మెఱుంగ వైతివి కాదు కాదు. మనస్సునకుస్ఫురించియు నట్లునటనజూపుచున్న వాడవు స్త్రీజనము తమహృదయములు మును మున్నే పురుషులకెఱుకపరచుట యసమంజసంబని బయలుపడక గర్భీకృతంబుగా వచించినను రసికజనమనోభిరాముడవగు నీవు నాహృదయస్థితి నానోటనే వినవలచి యెఱుగనివానివలె నటనజూపుచున్న వాడవు. యింక దాపజాల తాళజాల శరణాగతపరిపోషణుడవు. అభయ మొసంగియున్న వాడవు. ప్రాణదానంబొనర్చితినని శపథపూర్వకముగా బలికియున్న వాడవు నిక్కము వచించెద ద్రౌపదీ స్వయంవర కాలమున మత్స్యయంత్రము ద్రుంచి కాంతను వరించితివని మత్స్యహోదరునకు మణికంధరుడు చెప్పినప్పటినుండియు నీచిత్రపటములిఖించి తెప్పించి చెంతనుంచుకొని యిటు చూడుము (పటమును జూపుచు) యిదియే ప్రాణాధారమని దలంతును. నిన్ను పతిజేయవలెనని హాటకేశ్వరు నర్చింతును. మనమిరువురు నేకశయ్యాధిష్ఠితులైయు పరతిసమరతు లొనర్చునటుల కలగాంతును. యీప్రదోషకాలదేవాభిషేక జలాపేక్షచే గంగానది కేతెంచి నిన్నుగాంచి మోహించి యిచ్చటికిదెచ్చితి. నాకోర్కెలీడేర్పుము. ప్రాణదానంబొనర్పుము.

అర్జు—రామరామ (అని చెవులు మూసికొనును)

ఉలూ—యెందుకట్లువచించెదరు. నేనును రామకమే

అర్జు—యెంతటిమాట వినుపించితివి?

ఉలూ—శూలప్రహారమా తప్తతైలస్పర్శమా.

అర్జు—పరాంగనలగూడుట మహాపాతకముగాదా?

ఉలూ—నేనుకన్యకనుగదా. పరకాంతనెట్లౌదు?

అర్జు—కన్యకవేననుకొందము సంకల్పపాణిగ్రహణంబైనను గావలయుగదా

ఉలూ—ద్రౌపదీస్వయంవరము వినినతక్షణమే నామనము పాణిగ్రహణంబైయున్నది

అర్జు—నేనట్లుదలచుకొనలేదే

ఉలూ—యిప్పుడుదలచుకొని

అర్జునుడు (౧౧ అనుబంధము)

అర్జు—క॥ లేమా వినుమ్రతినై నే
భూమిప్రదక్షిణము జేయబోవుచునిటులన్ ।

కామినులగూడగానగు
వామగువా దిగులులేక పల్కుటతగువా।

ఉలూ—శరణాగతరక్షణము క్షత్త్రియులకు భూషణముగాదా!

అర్జు—తీర్థయాత్రాదీక్షితుడ నన్ను వరింపకుము మోహింపకుము

ఉలూ—కాంచపదవృత్తము

మారశరీరా సూరివిహారా
మదనశరములిదె మదవిదళించెన్ ।
కోరినదానన్ కూరిమిమీరన్
కులసతిగను ననుగొనుతమిమించెన్ ।

అర్జు—కాం

వారిజనేత్రా వర్ణితగాత్రా
పరసతిగవయగ పరమభవంబౌ ।
జేరకుచెంతన్ గోరకుమింతన్
శివశివబలుకకు చిరమెనుఖంబుల్ ।

ఉలూ—గీతం

గీ॥ మదనసాయకబాధకు బెదరినీదు
ప్రాపుజేరితిజేకొని రతులదేల్పు ।
ప్రాణదానముకన్నను ప్రబలమైన
వ్రతములుండునె ధరలోనప్రాణనాథ ।

నన్నుకన్నెగానెటుంగుము. నీయందేయనురాగరసభరితయనుకొనుము. మన పాణిగ్రహణభార్యయనుకొనుము. యీకాంతకోర్కెనెరవేర్పకున్న ప్రాణత్యాగం బొనర్చునకొనుము స్త్రీవధాదోషబద్ధుండనగుదుననుకొనుము. నాయొప్పిదము నకై యింతబ్రతిమాలుచున్నది. బలాత్కరించి పైబడిగాఢాలింగనం బొనర్చిన భూప్రదక్షిణవ్రతంబే చందంబున నుండుననుకొనకుడు నాథానాకోర్కె దీర్పుము యేల ఈ కఠోరహృదయము.

అర్జు—నీవు నాగకన్యకవు నేను మానవుడను. యితరజాతినిగూడుట శాస్త్రసమ్మత ముగాదు. నీకోర్కె చాలింపుము.

ఉలూ—నీవిటులాడ నేనేమనివచింతును తొల్లి శ్రీరామమూర్తి కుమారుడైన కుశమహారాజు మాకు నుద్వతినివరించలేదా? పురకుత్సమహీరమణుడు మానర్మదం బెండ్లి యాడలేదా? నీమనమెుక్కటియే యనవసరధర్మ ప్రస్తాపితమైయున్నది. పంచశరు డదలించుచున్నవాడు, కనికరించుము.

అర్జు—(తనలో)యీకతాళజాల (ప్రకాశముగా) తరుణీస్వాంత వృత్తాంతము దెలియబల్కితివి గాని

చం॥ నినుగనుగొన్న మాత్రమున
నీరఫలాశనులైన మౌనులా,
మనసిజబాణజాలముల
మందురటే మె మితారి నాపయిన్‌.
గనికరముంచి మోహమగు
కౌగిలియిమ్మ నృతంబుగాదు నే,
ననుపమమారుకేళిన నయంబును
గూడుదు సంశయింపకే॥

(ఆలింగన మొనర్చును)

ఉలూ—(సిగ్గున తలవ్రాల్చును)

అర్జునుడు (౧-౨ అనుబంధము)

అర్జు—(ఉలూచి కరగ్రహణ మొనర్చును)

తెరబడును.

## ద్వితీయాంకము—ద్వితీయరంగము.

గంగానదీతీరము.

విశారదుడు ఫలపుష్పములు గైకొని ప్రవేశము.

విశా—రాజేంద్రా అర్జునమహీపాలా యేమిది యిచ్చట జపము సల్పుచుండిన గోచరుడై నిరుత్తరుడయ్యె. మరలబిలచెద.

రాజేంద్రా—సంక్రందననందనా అర్జున మహీపాలా సభోత్తమా (భయమున)యింకేమిగతి. దైవమాయటకరిగె యీ చెట్లచాటున నిద్రించుచున్నవాడా పాపాసాపరుండై గంగానది బ్రవేశించెనా? చూచెద.

(పోయిచూచి మరియొకప్రక్కన బ్రవేశించును.)

సీ॥ తరులారవిరులార దరులారజూపరే
వనజాంశుడైనయర్జునమహీశు ।
కరులారహరులారగిరులారజూపరే
ఘనశౌర్యుడైన యర్జునమహీశు ।
మణులారగణులార ఫణులారజూపరే
మనసిజాకారునర్జున మహీశు ।
యెలులారయళులార పులులారజూపరే
దినకరతేజునర్జునమహీశు ।
దారులారభూమిదారులార మనోజ్ఞ
శారులారరాజకీరులార ।
బైరులారముద్దు పారావతములార
శ్రీయుతాంగుపాండవేయుజెప్పుడీ ।

అక్కటా! నదిని బరకించితి, పొదల వెదకితి. సైకతస్థలుల జూచితి చంద్రకాంత వేదికల నరసితి వనముల విమర్శించితి. నాశ్రమముల బరిక్షించితి వృథాప్రయాసయే క్రూరులైన ధృతరాష్ట్రపుత్రులేదేని మాయబన్నిరో బద్ధానురాగుడై జన్మాదినె డబాయని నామిత్రు సుగుణపాత్రుని విమలజైత్రు పరమపవిత్రు విడచి నేనెట్లుందును అయ్యో! యీ పాపిఫల పుష్పంబులకే నేమిటికి జనితినైన మరల సంబోధించెద.

ఉ॥ ఓనరసార్వభౌమ సరసోదిత సుందరకామసత్యసం
ధాన రనాథసోమరిపు ధారుణీనాయక భీమపాండవే।

యానతపోవసీమపరి యాచకమేలనో హా సుమిత్రమా ।
గానగలేక స్రుక్కితిని కాంతు దలిర్పగ రాగదే దయన్ ।

ఇంకెక్కడిమిత్రుడు. యింకెక్కడితీర్థయాత్ర. దురాత్ములచే నేమిబాధ బడెనో. జపతత్పరుడై మైమరచి యుండెనేమో. అడవులలో సంచరించునప్పుడంతటినియమమా. అంతటిభక్తియా. యిప్పుడా నియమమేమైనా రక్షించెనా? నేనెన్నిమారులో జెప్పియుంటినే "పథిశూద్రవదాచరేత్" అనియుండలేదా? యిదో గాండీవమిచ్చటనే బడియున్నదే. ఇంక ఖడ్గము మాత్రమా అదియునిచ్చటనే బడియున్నది. యింకేమిగతి.

(౧౩. అనుబంధము)

సీ॥ గాండీవరాజమా! ఖండితాహితశిరః
కుంతలాధిక లసత్కాంతు వేడి ।
కోదండమా! మత్త వేదండదోర్దండ
దోర్దండగుప్త వేధోండుఁ జేడి ।
కాండీరమా స్ఫురత్కాంతిదైకదుర్లక్ష్య
కాండాటఘన యంత్రఖండుఁ జేడి ।
ధనురాజమా! చంద్ర దినరాజతారాద్రి
చిరకీర్తిదిగ్రమా భగితుఁ జేడి ।
వాసవేయుని జూపు శరాసనంబ
కాంతిజితహేము జూపు సత్కార్ముకంబ ।
శూరవరుజూపు బాణతూణీరకంబ
భూపతిని జూపు మహనీయ్యచాపవర్య ।

హరిహరీ యీయంధకారబంధురంబు నందింకెచ్చట కేగనని జూతును.

యింద్రప్రస్థమునకేగిన ధర్మభూపాలుండరుదెంచి యర్జునుండే డీయనిన నే నేమ నివచింతు. కార్యము చెడిరి. నేనిప్పటనే ప్రాయోపవేశంబొనర్చెద (అంతలో దక్షిణభుజనయనము లదరును) యేమిది? దక్షిణభుజయనములదరచు శుభమును సూచింపుచున్నది. తెల్లవారువరకు విశ్రమించెద, అదే తెల్లవారుచున్నది. నంతలో జను దెంచిన సంతసమేగదా లేకున్న నిప్పటి రోదన.

(అనుచున్నంతలో అర్జునుడు ప్రవేశించును)

విశా—(ఆతురమున) అర్జునా! అర్జునా! (అని ఆలింగనమొనర్చుకొనును)
యిది స్వప్నమా లేక నిక్కముగా నిను జూచుచున్నానా?

అర్జు—విశాగదా యెందుకింత భయపడియున్నావు? మోమున విన్నదనము నయనముల వారిధార గాత్రమున చలనము చరణములతో త్రుపాటు

విశా—నీ లేమికి నా ప్రాణములున్నవో లేవో తెలియకుంటి నేడుగదా ధన్యుడనైతిని నీ వెచ్చటికరిగియుంటివి?

అర్జు—ఏమని వచింతు నిచ్చట జపముసల్పుచుండినది. నీవెరంగుదువుగదా?

విశా—చూచియుంటిని

అర్జు—

గీ॥ జపముజాలించి కనువిచ్చి స్వర్ణరచిత
సౌధమున హంస తూలికా శయ్యపైన
నుండు భువనైక శృంగారనొక్క నాగ
కన్యకామణి గాంచితిగాదె సఖుడా ।

విశా—చూచి

అర్జు—చూచితిని గాని, అహా!

క॥ ఆ రూపమా విలాసం
బా రతి కేళీ విహారమా సుఖశయ్యా ।
గారంబా శృంగారం
బే రామలయందు గాననీ సతి దప్పన్ ।

విశా—వోహో సౌందర్య వర్ణనసరియే. రతికేళీ సౌకర్యంబ భివర్ణించుట చిత్రముగా నున్నది. అదెట్లు దెలసె!

అర్జు—మిత్రమా తెలియకనే వచించితి నను కొంటివే.

విశా—యెట్లెరింగితివి!

అర్జు—హంసతూలికపై జేర్చి నన్ను బ్రార్థించె. ద్రౌపతీ స్వయంవరము వినిన దాదిగా నన్నేపతిగా గోరినదట. నాచిత్రపటము లిఖించి ప్రాణాధారము గాకంచుకములో దాచియుండునట. విరహమునన్ను గలియునటుల కేలగనునట. పటము గన్నప్పుడంతయు మోహవశమునచుబుకు కుచముల నదిమి తన మోహముతానే శాంతిసల్పు కొనునట. యేకారునట. గ్రుక్కిళ్లు మ్రింగునట. నన్ను పతిజేయునటేనని హాటకేశ్వరుని పూజించునట. ప్రదోషకాల దేవాభిషేక జలాపేక్షచే గంగానది కేతెంచెనట జపముసల్పుచున్న నన్ను గాంచెనట. తిరోధానమాయచే నన్ను భోగవతీ పురంబు జేర్చెనట. తానాదిశేషుని పుత్రికయట. పంచ దినముల బ్రార్థించి వలచి వలపించె రతిక్రీడా సంయోగ యోగం బెట్టిదో సద్యోగర్భంబునందొక్క పుత్రుండుద్భవిల్లె. నిరావంతుండని నామకరణం బొనర్చె.

విశా—సరి అన్యోన్యావలోకనము యిప్పుడే. గాంధర్వ వివాహము యిప్పుడే రతిక్రీడయు నిప్పుడే. గర్భము యిప్పుడే. పునహారాకయు నిప్పుడే. యిట్లుండ వలదా. పోని నాగలోకమునుండీ యిచ్చటికి నీరాక యెట్లు?

అర్జు—

క॥ ఆసతినాగాయా బలమున
నీసన్నిధి జేర్చెనయ్య నిక్కముగానిన్ ।
బాసిసకలమున సఖుడా
జేసితినపచారమో ప్రసిద్ధముమదిలోన్ ।

రహస్యగమనమునకు క్షమింపుము.

విశా—సంతోషమాయె? నైననింక యింద్రప్రస్థమున కరుగుదమా?

అర్జు—అదేల, తీర్థయాత్రమువలదా?

విశా—అయినదే తీర్థయాత్రము. సార్థకశ్రేత్రము. వరపుత్రము.

అర్జు—సరిసరి నీహాస్యోక్తులుండనిమ్ము. చిన్న నాటినుండియు గాంచిన వేగదా. యిక నర్మధన్ గాంతము లెమ్ము.

విశా—మరచితి నాసతి పేరేమి?

అర్జు—యేల ఉలూచియట.

విశా—సరియే. ఉలూచియు, నర్మదయు, కుముద్వతియు వీరందరు నాగకన్యకలే ఉలూచి, చాలక, నర్మదను సహా జూడవలెనా. (ఆ పతిని మీ ప్రపితామహ ప్రపితామహపితామహుడైన) పురుకుత్సమహీసార్వభౌముడే వరించియున్నవాడు.

అర్జు—మిత్రమా! యోచింపనేల? నేనేమి కాపురుషుడనా. నీవన్నమాటగాదు నర్మదా నదిగాగని స్నానంబొనర్తమని బలికితి ఇంక గడయనేల నదియే వింధ్యాద్రి పోదము రమ్ము. (చేయిబట్టిలాగును)

విశా—నీయిష్టము పోదము. యిచ్చట నాగకన్యకాయె నచ్చట యే దేవకన్యక గలదో కానిమ్ము నీవేమి క్షత్రియుడవు నేను బ్రాహ్మణుడను నీకు ప్రత్యక్షకాంతాసంగమము నాకు పరోక్షకాంతాసంగమము నాకుమాత్రము నొకకాంత లేదో?

(అనుచు అర్జునునివెంట ప్రక్కకు నిష్క్రమించును)

—అవనికబడును—

---

## ద్వితీయాంకము—తృతీయరంగము.

### వింధ్యారణ్యము—విద్యున్మాలియాస్థానము.

రుధిరాక్ష—తామ్రకేశ—జ్వాలాజిహ్వ—కరాళ—దంష్ట్రినులు హాహాకారమున ప్రవేశించి ప్రక్కననిలతురు

విద్యున్మాలి ఖడ్గపాణియై హాహాకారమున బ్రవేశించి

భటులారా నేడేమేమికార్యం బొనర్చిలిరి.

రుధి—రాక్షసేంద్రా! వింధ్యాగ్రమున సంచరింప విద్యాధర మిధునంబునుగాంచి విమానముబడద్రొబ్బి యతుని నర్మదబడ్డచి తత్కాంతతో క్రీడించి మీ కాహారార్థమై వేయి పెద్దపులుల మాంసంబునుదెచ్చియున్నాను.

తామ్ర—దేవా! బదరికారణ్యమున యజ్ఞం బొనర్చుచున్న ఋషులగట్టివేసి

హోమ కుండంబుల మూత్రము విసర్జించి అశ్రీమములు పాడుచేసి మునులచే రక్షింపబడుచున్న హరిణములను జంపి మీ కాహారార్థమై తెచ్చియున్నాను.

జ్వాలా-ప్రతాప మార్తాండా నేడేమి కార్యములు సల్పలేదు. బ్రాహ్మణుల మాన్యములలో గోతులను ద్రవ్వించి శవస్థాపన మొనర్చి సస్యముల కుపయోగింపకుండునట్లు చేసి వచ్చియున్నాను.

కరా—మహాప్రభో నూతనో ద్వాహబ్రాహ్మణ వధూవరులశ్వంబుపై నూరేగు చుండ బట్టి వధించి పురుష మాంసము నాకును, స్త్రీ మాంసము మీకును తెచ్చియున్నాను.

విద్యు—భళా! భళా! మీరుగదా నా భృత్యులు మన వంశంబునకు కీర్తి తెచ్చితిరి రుధిరాక్షా హిడింబ బకాసురుల జంపిన వాడెచ్చట నగుపడలేదుకదా!

రుధి—మనభయముచే బైట సంచరించుట కోటుబడి యింద్రప్రస్థము నందే యణగి యున్నవాడట.

తామ్రి—ఆ సురాత్ముండీ యడవికి వేటకొరకైనను రాడు గాబోలు.

జ్వాలా-వాడే యీ యడవినడుగిడిన పిడికిటిచే బొడచి పొడి పొడి చేసి భూమిపై బడనడపనా

కరా-అశ్రీసుపాలుండగు నేను విడచిన గదా మీ బారిబడుట వాండెప్పుడో నావాతబడువాడే. మీ కెందుకాయాశ?

విద్యు-భృత్యులారా మనశత్రువులపై మన తెంపట్లుండవలయు కానిండు నడ ముడి యీ యడవికి రాకుండునా మనకోర్కె నెరవేరకుండునా మన దుర్యోధన సార్వభౌముడేలనో తనక్షేమంబు తెలియింప కున్నవాడు పాండవ సంహార కార్యాంతరాసక్తుండై యున్నవాడు కాబోలు

(అంతలో నే పద్యమున విద్యున్మాలి రాక్షసేంద్రాయని ధ్వని)

విద్యు—ఎవ్వడు మానవుడు గానున్నాడు?

(మరల నే పద్యమున హస్తినాపురము దుర్యోధనచక్రవర్తిగారు జాబు బంపియున్నవారు)

విద్యు—ఓహో! రమ్మనుము, రమ్మనుము.

(చారుడు ప్రవేశించి భయముచే వణకుచు జాబొసగును.

విద్యు—(జాబువిచ్చి చూచుకొని) అహా! అర్జునుని తీర్థయాత్రాపర్యటనమా మంచిది మంచిది. చారా యీ జాబు నందింకొక్క జాబు బంపినట్లు వ్రాయబడినదే.

తామ్ర—దేవా నా కాళలియగుచున్నది (అని చారునివంక చూచును)

జ్వాలా—యీ తునుజూడంతయు ఏకేనో? మనకు చెరి సగము

చారు—దేవా (అని కేక వేసి నేలబడి భయముచే అదురును)

విద్యు—(కోపదృష్టిచే) భటులారా! యింతయాజ్ఞలేనివారైతిరే? యీ చారుడు మనుజుడైనను మనచక్రవర్తిగారి సందేశహారుడగుటచే మనతోడివాడే యితనిని భయపెట్టకుడు

(అని చారునిసేదదీర్చి కూర్చుండబెట్టి)

విద్యు—చారా భయపడకుము నేనున్నాను లెమ్ము జాబొసగుము

(చారు డదరుచు దట్టీలోనున్న మరియొక జాబొసగును)

(రాక్షసభటులు చారునిజూచి కనుగ్రుడ్లుద్రిప్పుచు నాలుకల్లార్చుచుందురు). చారుడు మరల మరల రాక్షసభటులచూచుచు భయపడుచు కేకవేయుచుండును విద్యున్మాలి జాబు చదువుకొనుచుండును)

విద్యు—(పూర్తిగా జాబు చదువుకొని) శకునివంటి మాయాప్రవీణుడు గలడా? రెండవ శంబరాసురుడుగాబోలు చారా యిక నీవు వెళ్లుము. కార్యసాధనం బొనర్తునని జెప్పుము. (చారుడు నిష్క్రమించును)

విద్యు—భటులారా మీరు మీ పనులకై వెళ్లుడు రుధిరాక్షుడుమాత్ర మిందుండని

(విద్యున్మాలి రుధిరాక్షుని దప్ప మిగతవారు నిష్క్రమింతురు)

విద్యు—రుధిరాక్షా యీజాబు జూచితివా? భళా! నాకోర్కె నెరవేర అసురాత్ముడగు భీముడే వచ్చునని యుంటి నాతనికేమిటి వెనుదియ్యని యర్జునుడు వంటిపై తీర్థయాత్రకు జనుదెంచెనట నేడో రేపో నర్మదానదికి స్నానార్థమై యరుదెంచును. ఆ దురాత్ముని సంహరించుటకు సార్వభౌముడు నాకొక్కపనియు నీకొక్కపనియు గల్పించి నియమించి యున్నాడు. నాప్రతాపమునకే హతుడగును తప్పిన నీ వాయుకు తప్పక హతుడగును

యుద్ధము నాకును మాయు నీకును ఔరా అర్జునా నీ రక్తంబు గ్రోలుట.
మాంసము దినుట నేటికి తటస్థించెగదా.

సుధి—అన్నయ్యా! అర్జునుడైన గాండీవసహితుడై వచ్చునేమో

విద్యు—తీర్థయాత్రకు జనుదెంచువాడు గాండీవము నేటికి మోసుకొనివచ్చును
తెచ్చెబో నా గదా ఘాతమున కాసాట్టిదబ్బ నిలచునా?

(నేపథ్యమున విశారదాయను ధ్వని)

విద్యు—అదో యువ్వరో వచ్చుచున్నట్లున్నది! వాడేయుండినలయు చూతము.

(అని పరిక్రమించి నిష్క్రమింతురు)

అర్జునుడు విశారదుడు ప్రవేశము

అర్జు—విశారదా నిఖిలపథికాయాస పరిశాంతంబును, మాణిక్య రాశికి జనన
సీమయు, ఓషధీలతలజీవనమును రేవానదికి జన్మభూమియు పరమాహ్లాదకర
మునగు నీ వింధ్యాద్రిని గనుంగొనుము.

విశా—శ్రీ మహాలక్ష్మి యీ పర్వతముననేగదా తొల్లి విశ్వరూపము ధరించినది.

అర్జు—ఔను పార్వతీదేవి దుర్గాసురుని సంహరించి దుర్గాయను పేరునొంది
నదియు యిచ్చటనే

విశా—యీ నదీమతల్లియే గదా నర్మద?

అర్జు—ఔను! యీదేవిని ప్రార్థింతము,

శా॥ రేవానామవిలాసినీభగవతీ
శృంగాటికావాసినీ।
శ్రీవింధ్యాద్రిసముద్భవే భవహరే
శ్రీ తారకాంతస్థితే।
దేవేంద్రాదిసుర ప్రపూజితపదే
దీనార్తివిచ్ఛేదినీ।
దేవీనర్మద నీకు మ్రొక్కెదనిదే
దీవించిరక్షింపవే॥

విశా—అర్జునా! నీవేగదా తొల్లి యీనదిని సహస్రకరములతో నడ్డగించి దళ

కంతుని పూజా ద్రవ్యములు ముందునట్టొనర్చినది.

అర్జు—మిత్రమా యేమిట్లు మాట్లాడెదవు? హైహయ వంశతిలక భూతుడై యవక్ర విక్రమముచే సప్తద్వీప వసుంధరాభార భుజాసహస్ర విభాసితుండై మాహిష్మతీ పట్టణాధీశుడై దశకంఠగర్వ పర్వత శతారుండై శ్రీమహా విష్ణువు సుదర్శన చక్రాపరావతారుండై పేరుగన్న కార్తవీర్యార్జున భూపాలునకు నాబోటివారలు సాటియగుదురే నాపైగల విశ్వాసముచే, నీవిట్లు నన్ను బ్రశంసించెదవు. తడవయ్యె ఆదో అన్యగ్రోధచ్ఛాయయందు కొంచము విశ్రమింతము రమ్ము.

విశా—అప్పుడు కార్తవీర్యార్జునుడవు యిప్పుడు పాండవార్జునుడవు. నిన్ను నీవు పొగడు కొందువా? (యనుచు యిరువురు నిష్క్రమించి మరియొక ప్రక్కన బ్రవేశించి).

అర్జు—యిదేమి రాక్షస నివాసమా? సుత్తంత బంధురమై, అద్రిమాంసాస్థి కర్దమంబై యున్నది.

విశా—ఓహో! యిది వింధ్యారణ్య ప్రాంతముగదా, యిచ్చట మన దుర్యోధన మిత్రుడు విద్యున్మాలి యను రక్కసుడున్న వాడని మాతండ్రి ధౌమ్యుల వారనుచుండ నే వినియున్నాను. మనము జాగరూకులమై వర్తింపవలయు.

అర్జు—దుర్యోధనుని మిత్రుడు హాలాయుధుడు గదా.

విశా—ఆ హాలాయుధుని తమ్ముడే యీవిద్యున్మాలి.

అర్జు—అట్లనా (అని గాండీవము సవరించి టాంకార మొనర్చును) (ఘోరశబ్దముతో భయంకర ఖడ్గముతో విద్యున్మాలి ప్రవేశము).

మానినీ వృత్తము॥ ఘోరతరంబగు నావనరాజము కోరికె
జొచ్చితె నిర్భయుడై।
వీరపరాక్రమ విశ్వభయంకరు విష్ణు
ముఖామరులైన నను౯।
జేరియమాంతికము౯ గనబోదురు
చిత్తమున౯ జోరజాలరుగా।
వీరుడనంచిటు వెర్రినివచ్చితె విద్యు
న్మాలి నెగుంగక య౯॥

ఎవ్వఁడవురా నరాధమా! అంభోజ భవశంభు కుంభినిధరులైనను ప్రళయ రుద్రాక్షోగ్రాగ్ని దర్శితమ ప్రతాపాగ్ని దాహిష్టాతి దీర్ఘవిస్ఫుల విస్ఫులింగ ఘాత ప్రభిన్న బ్రహ్మాండ భాండుండగు నేనుండ మహాగహనంబున కేతెర భయంబు జెందుచుందురు, నానామాత్సర శ్రీసనమాత్రమున నేవిముక్త శంఖ, చక్ర, శూల డమరుక, దండ, కమండలులై, విస్రస్తమణిమకుట వైజయంతీ కపాలా స్త్రమాలా గమపుస్తకులై, విభ్రంశితమకాళ, మహోక్ష, పన్నగాశనులై, ముష్టిబద్ధపాణులై, పరువెత్తుదురు. ఇట్టి మత్ప్రతాపాగ్నికి శలభ ప్రాయుడై జనుదెంచితి వెవ్వఁడవీవు.

అర్జు—దురాత్మా, నిదాఘగంధానో దీర్ణబాణావళీ నిరుద్ధదిఙ్మ భోభాగుండను. శింజనీరవమాత్ర చతుర్దశ భువన భయంకరోద్దండ గాండీవనామ కోదండా సనధరుండను. పర్జన్యాది నిర్జరతాణ జర్జరీ భూతుండగు అర్జును నెరుంగవా దనుజాయిదే? నాబాణానలంబున నీప్రాణా నిలంబీక్షణంబున రణక్షోణిగ్ గ్రోల్చెద చూచుచుండుము.

(అహాహాహా అని నవ్వి)

విద్యు—నీవేనా అర్జునుండవు? నామాతులుండగు బకాసురుని వృద్ధ రాక్షసుని జంపి మాయన్న భీముడు విర్రవీగుచున్నవాడని వింటిని భళా! నేడుగదా సుదినము. అభీమునిపై బొడమిన కోపము నీపైన బ్రయోగించెద తాళుము. (అని ఖడ్గము విసరును).

అర్జు—రాక్షసా నిన్నీక్షణమున పుడమిగ్ గూల్చెదజూడుము.

(అని యొక్క బాణము వైచును. రాక్షసుడు నేలబడి తన్నుకొని ప్రాణములు విడచును).

అర్జు—విశారదా ఈదురాత్ముడింత మాత్రమున కేమి గర్వోక్తులాడెను. తామ సగుణమే ప్రధానమైనదానవుల చిత్తమెప్పుడును క్రూరత్వమే చూపు చుండునుగదా?

విశా—అర్జునా అటు లేకున్న తొల్లి రక్కసులందరు మహర్షులను, గోవులను బ్రాహ్మణులను, హింసించుచుందురే, యితనిని సంహరించి బహుమందికి ప్రాణ దానం బొసంగితివి.

అర్జు—యిచ్చటికి గోకర్ణ క్షేత్రము సమీపముగదా? వెళ్లుదము.

(నిష్క్రమింతురు).

(తెరదిగజారును).



శ్రీ

# సుభద్రార్జునీయము

## తృతీయాంకము—ప్రథమరంగము.

### గోకర్ణ పుణ్యక్షేత్రము.

దేవాగారము—ఈశ్వరునలంకరించి యుందురు.

అర్జున విశారదులు దేవపూజ లొనర్చుచుందురు.

అర్జు. (౧౮ అనుబంధము).

సీ॥ ఉరగభూషణవీర వరగజాంబరధార
గరగళాంచితధీర గిరిగభీర।
రజితాద్రిసంచార విజితామరవిదార
భజితార్తిసంహార భవవిదూర।
కరుణ పారావార తరుణభాస్కరసార
తరణభీసంసార తత్త్వపూర।
శమదమాంతవిచార డమరుకాభిదధార
ప్రమదామనోహార భయనివార।

గీ॥ అలకనందానదీసంగ మాద్భుతాంగ।
శుభ్రతరదేహహిమభూధ్ర సుతవిమోహ।
దళితస్మరరూప స్మరరూప ప్రళయనటన।
శంకరా దేహిదాసోస్మి శరణు శరణు॥

ఉమారమణా శంకరా సాంబాహరోంహర హరమహాదేవా విశారదా యీపుణ్య స్థలంబున నేడు వసింతము. యీసమీపమున నిక పుణ్యక్షేత్ర మేమి గలదు.

విశా—మిత్రమా! సప్తమోక్ష పట్టణంబులలో ప్రత్యక్ష భగవత్ప్రకాశితంబగు ద్వారకా పట్టణ మిచ్చటికి సమీపమునందున్నది. అచ్చటి కరగి కృష్ణ పరమాత్మను దర్శించి యింద్రప్రస్థంబున కరుగుదము.

అర్జు—ద్వారపతి యిచ్చటికి సమీపమా?

విశా—ఔను.

అర్జు—అట్లయిన నేనొక్కడనూ తత్రిమచ్చటి కరిగి వచ్చెద నీవీపరిజనహితుండవై గోకర్ణంబునందే యుండుము.

విశా—మంచిది నీవు శీఘ్రముగ రమ్ము.

అర్జు—యిదే నమస్కరించెద.

విశా—కల్యాణమస్తు.

(విశారదుడు నిష్క్రమించును).

అర్జు—

గీ॥ ద్వారకాపురమిచటికి చేరువయని
మావిశారదుడెరిగింప మనమునందు।
సంతసిల్లితిగాని యేచందమైనను
యానుభద్రనుగాని తెత్తు భాసురముగా॥

గడుదరుదెంచినది మొదలు. కాదు, కాదు. వహాయన్నగారి యౌవ్వ రాజ్యాభిషేకము మొదలు సుభద్రపై మోహావశంవదుండనై యున్నవాడ. నీ యతనుతాపంబెవ్విధి దరియింతు. హా మన్మథా?

మ॥ దుర్విపింఛాపత్య కఠోరఫాలహుతభు
గ్జ్వాలీతనుండవై మహా।
గహనంబందునళించి నీతరుణి భా
గ్య ప్రాప్త జీవుండవై।

సహాసంభూత గుణంబు మానవటరా
చండా దురాత్మాస్మరా।
అహాహా నీకిది మేరగాదుర మహా
హంకార నీచక్రియల్॥

అగదు డెందు కరుడెంచె, నే నేల పృచ్ఛయొనర్చితి, బలభద్రుడు సుభద్రను నా కొసంగునా? అదేటిమాట సన్యాసి వేషముతో రమ్మని కృష్ణమూర్తి కలవో సంగి యున్నవాడు యేమి ప్రయోజనము అసహ్యాకరము విరక్తిమార్గము జడలు ధరించుట యజ్ఞోపవీతమును గుప్తపరచుట కాషాయవస్త్రములు, రుద్రాక్షహారములు, విభూతిధారణ, యోగ వాగము, కమండలము, ఔరా సన్యాసము ఛీ. ఛీ. ఆవేష మీ భాషకు తగదు సమంజస రూపమున నేగిన బలరాముడిప్పుడు సన్యాసిగా యున్న నా కొంత వరింపడు. సుకుమార శుభలక్షణోపేతయగు సుభద్ర యీ దర్భ కృష్ణాజనంబుల మోహించి మోయుచుండునా సౌందర్యవంతుడనే యగుదుగాక నే నెట్లున్నను సుభద్రకు నాపై వాంఛయే బొడముగాక తగుసమయమే ఘటించుగాక సన్యాసినై మరల గృహస్థాశ్రమంబవలంబింప వచ్చునా తరుణీసంగమం బొనర్పదగునా యిది క్రమసన్యాసంబును గాదు ఆతుర సన్యాసంబును గాదు వుప్పరసన్యాసము, వుభయభ్రష్టత్వము, నిష్ప్రయోజనము. యీదర్భ యీభస్మ యీ రుద్రాక్షులన్ జూచి మెచ్చునా వచ్చునా చేర్చునా పిచ్చిగాక కాని యోచింపనేల దండసాధ్యమే యనుకూలము లయసమయ కరాళకాళీభయదమార్గణాసారంబుల బలరామాదియాదవులను దుర్యోధనాది కౌరవులను నిర్భగ్న, నిర్భిన్న, నిష్పిండ్య, నిర్మూల, నిర్నామం బొనర్చెద. వారేమి వుద్దండ దోర్దండ మండిత గాండీవనామకోదండాసన విముక్త కాండనిర్దళితాజాండభాండుండైన మద్విజృంభణంబున కోర్చుటేమి. అయినదికాని చూతము.

అర్జు (౧౨ అనుబంధము)

(మరలయోచించి) యింతతొందరయేల శ్రీకృష్ణమూర్తి యానతిరీతి సన్యాసివేషంబు నే ధరించి జనియెద పిమ్మట యోచింపనౌను.

(అవనిక బడును)

———(0)———

## తృతీయాంకము—ద్వితీయరంగము.

(అరణ్యము)

(రుధిరాక్షుడు మాయావేషమున భీముని రథసారథి విశోకుడై యొకజాబు చేతబట్టుకొని ప్రవేశించును).

అబ్బా? వాడు అర్జునుడా? కాలయముడా? యేమిపరితాపము యేమి బాణసంధానము యేమి రౌద్రము హా? కాలభైరవాకృతికైనను యిట్టి శౌర్యముగలదా మాయన్నయగు విద్యున్మాలిని, అఖిలరాక్షసకులపాలిని, ప్రళయకాలాపరకాలిని, నిఖిలనిర్జరగర్వాంధపరితాపాంశుమాలిని. ఒక్కబాణము—. నయ్యో (యెద గొట్టుచు) అదేమిబాణము ధగ ధగ మెరుగులెగయ దివిభువినావరించి విస్ఫులింగము లష్టకాష్టములకు బ్రసరింప అహా? తలచుకొన్న దేహము ఝుడియుచున్నదే. భోరునవక్షంబుమారినమాత్రముననే హరహరా (దుఃఖమున) అన్నా! విద్యున్మాలీ యింకన్నటికి నిన్ను గాంతు విలవిలతన్నుకొని ముక్కున నోటను రక్తధారలు గురియ బోరగిలబడి ప్రాణములువిడిచెను. "అక్కటా" అన్నా (విజృంభించి ఆకాశముజూచుచు) దురాత్మా పాండవాధమా యిదే (ఒరలోని కత్తిదూసి చేతియందు ధరియించి) యీ ఖడ్గముచేనిన్ను యడవికి బలియిచ్చి నీ రక్తముచే మదగ్రజునకు తర్పణమువిడుచుచున్నాను పోయెద (రెండడుగులుముందిడి) అట్టిజగజ్జెట్టియే ఒక్కబాణముచే జచ్చె యిక నేనా ఆగాండీవి—గాండీవి గాండీవము— (యెదపైచేయినిడుకొని) ఆపాడుగాండీవమెక్కడదాపురమాయెనా దురాత్మునికి (అనునాసికముగా) ఊ! హూ! పౌరుషమున బ్రయోజనమే లేదు శకుని మాయచే కల్పింపబడి సార్వభౌమునిచే బ్రచురింపబడినదిగదా యీజాబు దీనిచే జంపెద నిక్కముగా నీ పత్రికమాదురాత్మునికంఠలతాలవిత్రమే యీతని నేవిధమునైన వధించవలెనని సార్వభౌముని యాజ్ఞ వధించితినా మాకులజ్యేష్ఠుడై లంకలో నున్న విభీషణుని పరిపాత్రి ప్రపాత్రిక నొసంగి వివాహంబొనర్తునని దుర్యోధనమహారాజు నిశ్చయించినాడట బలిచక్రవర్తి సహా తనమనుమరాలి పరిపాత్రికమదుదలి మునిమనుమరాలినొసంగ నెంతయో ప్రయత్నించు చున్నాడట మంచిది. నాకేమికొదువ నాకార్యము నెరవేర్ప కాలభైరవుడున్నాడు కానిమ్ము.

నేనేమో భీముని రథసారథి విశోకునివేషముతో నున్నాడను (ప్రక్కకు దృష్టులుసారించి) యెవ్వడోయట జనుదెంచుచున్నాడు. ఋషియా సన్యాసియా.

కాదు కాదు. అర్జునునిబోలియున్నవాడు. (నిదానించిచూచి) అర్జునుడే. యేమిది మా యన్ననుజంపిన వేషముగాదే ఋషి వేషము. గాండీవమేదీ. అర్జునుడెందు కిట్లుండును. అర్జునుడుకాదు కాదననేల యిట్లుండుట కేమికారణమో యిచ్చట నున్న తీర్థసేవ కిట్లనేయుండవలెనేమో యెవ్వడైననేమి. విచారించి అర్జునుడేయైన నామాయ బ్రయోగించెద ఋషియైన నాకొకలి సమయము గానున్నది. భక్షించెద. నేనిప్రక్కనసుండి నిదానించి వీనిపోకడలు గమనించెద (ప్రక్కకునిష్క్రమించును)

(అర్జునుడు సన్యాసివేషమున బ్రవేశము)

వం॥ అతివలపొందురోశి గహనాంతర

సంచరులైవిరాగులై।

యతులయియుండు రెల్లరులుపోయిది

యేమివిచిత్రమోగదా।

(నవ్వుచు)

అతివనుపొందగోరి పరమాద్భుత తేజుడ

నయ్యుహోయనా।

యతియయియున్నవాడనకటాయిటులెవ్వరు

జేసిరర్వ్రిలో॥

ఇతరులెరుగకుండునటుల యతివేషము ధరించితి నిక ద్వారకకు వెళ్లెద.

(రుద్రరాక్షుడు బ్రవేశించి) యత్రీంద్రా వందనములు.

అర్జు—(ఆతురమున) యేమి విశోకాయిచ్చటికి వచ్చితివి.

విశో—(ఆశ్చర్యమభినయించి) తా మెవ్వరో యెరుగను.

అర్జు—నీ వెందుకు వచ్చియుంటివి?

విశో—భీమసేనమహారాజుగారు జాబుపంపి యున్నవారు. అర్జున భూపాలుడు గానరాడయ్యే తమరెరిగిన దెలియజేయుడు.

అర్జు—నేనే అర్జునుండను రేమిజాబు?

విశో—యతులబద్ధమాడవచ్చునా మాయర్జున రాజేంద్రుడు యతియౌనా

అర్జు—నిక్కముగా నేనేఅర్జునుడను కారణాంతర మీవేషము ధరించియున్నాను.

విశో— నేను నమ్మను గాండీవమేది విశారదుడెందుజనిరెు.

అర్జు— గాండీవ మొక్కఁ-చోనుంచియున్నాను. విశారదుడు గోకర్ణక్షేత్రమునం దున్నవాడు.

రుధి— (తనలో) అట్లైన బ్రతికితివి (ప్రకాశముగా) అయ్యో అట్లనా?

అర్జు— అందరు క్షేమముగా నున్నవారుగదా.

విశో— క్షేమముగానున్న నెలదినములనుండియు తిరిగి తిరిగి దిమ్మరల్లి వేసరితి పరుగెత్తి జాడి చూచి కంటకపాషాణములఁ ద్రొక్కి యిచ్చటికి నేనేమిటికి వచ్చుచుంటిని.

అర్జు— అక్కటా? యేమివర్తమానము చెప్పుము

విశో— జాబుజూచుకొనుడు సర్వము వేద్యమగును యీయవాచ్యము నేనేమని జెప్పుదును (అని దుఃఖించుచు జాబిచ్చును)

(అర్జునుడదరుచు జాబువిప్పి)

"అర్జునా మనఅన్నగారు నిన్నటిదినమున గంగానది ప్రాంత్యార ణ్యమునకు వేటకై వెడలి అచ్చట ననేకమృగములంజంపి తుద కొక్క సింహంబుచే యేమరుపాటునఁ జంపబడియె. నీ దుఃఖ మనుభవింప నా తరముకాదు నేను ప్రాయోపదేశమునకు సిద్ధుడనై నీ రాకకు నిరీక్షించి యున్నవాడ"

భీమసేన,

జ్యేష్ఠ బ ౧౨ ల్లు

ఇంద్రప్రస్థము:

అర్జు—హా! అన్నా ధర్మరాజా (యని నేలబడును)

(రుధిరాక్షుడు కత్తి వరలోనుండి సగాన బెరకును)

(అర్జునుడు లేచును) (రుధిరాక్షుడు కత్తి ముడుచుకొనును)

అర్జు—హా!

సీ॥ కన్నపుత్రునిరీతి నన్ను పోషణజేసి
యెన్నువారెవరింక నన్నుతాంగ।
సోదరానీశౌర్య మేదిరాజూడంగ
లేదురాయనువార లెవ్వరింక।

రాజగన్న తనుగన్న ప్రజకన్న నిజప్రేమ
జూపువారెవరింక భూపవర్య।
పాత్రికార్చనవిధుల్ బరుపసుఖీభవా
యనువారలెవ్వరో యన్న యింక।
గీ॥ భూప్రదక్షిణమునకేగ బూనియున్న।
నన్నుగనినీవు వచ్చునందాక దేహ।
ముండునో లేదో యనలేదె నింపు ప్రేమ।
యట్లులయ్యెనెదురదృష్ట మక్కటకటా॥

అగ్రజా యిట్టి గుర్వార్త వినుదునని కలనైనఁ దలంప యీ దుఃఖమిట్టిదని యిప్పుడు దెలసెగా దైవజ్ఞులమాటలెల్ల కల్లలాయెగదా. యిట్టి యఘోరవార్త విని యు పక్కలున బగిలి ప్రక్కలైపడకున్న నా మానసంబెంతటి కాఠిన్యమో నా దేహంబెట్టి కఠినకర్మాన్వితంబైయున్నదో యెంతపాషాణప్రాయమో.

అక్కటా? యీ సంతాపంబధికంబగుచున్నది నిరకతరింప జాల: రాకాశశాంకనిర్మలమై శాంతమై ప్రకాశించు నీ ముఖారవింద మీ జన్మమునందింక జూడగలనా. యింత చిన్నవయసుననే మహదాఖండలవైభవంబున చతుస్సముద్రముద్రితభూవలయంబంతయు నవక్రపరాక్రమంబున నేలుచు సత్యహరిశ్చంద్రుడవైన నీకీర్తి గోక్షీర, తుషార, డిండీర, శతార, స్ఫటికకౌముదీ ధిక్కరించి దిక్కు దిక్కులనిండి, యుబికి, ప్రబలి, యూర్ధ్వాదిలోకంబులతిక్రమించు టింత శీఘ్రమరణమునకేగదా? అయ్యో. మరణమన్న నాగుండె ప్రణమగుచున్నదే సకల ధర్మస్వరూపుడవే యిట్టి నీకకాలమరణంబెట్లు సంభవించె అన్నా నిన్ను జూపువారెవరు? 'నాసంతాపముఁ దీర్చువారెవరు. ఆ విద్యున్మాలియైన నను గ్రుంపడాయెగదా.

(రుధిరాక్షుడు నేను నేను యిప్పుడుసంహరించెదనను సంజ్ఞచే వక్షమును మోదుకొనును)

అటులయిన యీ పరిశీయవార్త వినియుండనుగదా. యాత్రికై నీ యానతిబొందగోరినప్పుడు వలదని యెంతజెప్పినను వినవైతివి మహా ధర్మస్వరూపుడైన నీవు త్రికాలవేది యగుటొక యబ్బురమే నీకు దెలసియే యానాడట్లుబలికి

యుంపవచ్చు. ఆ రహస్యమెఱుంగనైతి, మూర్ఖుడనైతి, **పాపిష్ఠుడనైతి**, నీవాక్యంబులు విననైతి నచ్చితి నిచ్చట దిక్కులేని చావు జచ్చితి, యింకేదిగతి యెవరు దిక్కెవరని బ్రార్థింతు శీఘ్రమున నిచ్చటనుండి జనుటకు సాధ్యమా? రథమైనను లేదు. తురంగమైనను అభావము అనాథ నాథుడైన శ్రీహరియే దిక్కు. హా! ఆపద్బాంధవా, శ్రీకృష్ణా, పాపోఽహం, పాపకర్మోఽహం. హతోఽస్మి, హతోఽస్మి.

(అని నేలబడి మూర్ఛిల్లును)

రుధి—చావుమురాత్మా? (అని కత్తియెత్తి నరుకుట కుపక్రమించును.)

(శ్రీకృష్ణమూర్తి ఆతురమున బ్రవేశించి) ఛీ! చండాలా (అని కత్తి తట్టివేయును)

(రుధిరాక్షుడు భయముచే దిక్కులుజూచుచు నిలబడును)

(కృష్ణుడు అర్జుననిసమీపించి అర్జునా? అర్జునా? యనిపిలచును)

అర్జు—(మూర్ఛదేరి హా! కృష్ణా హా! యగ్రజా యనును)

శ్రీకృ—అర్జునా! లెమ్ము లెమ్ము భయపడకుము నేను కృష్ణుడను.

అర్జు—(లేచి) మాయన్నను జూపుము కృష్ణా (అని పాదములపై బడును)

శ్రీకృ—మీయన్న యిచ్చటగలడా? యింద్రప్రస్థమునందు క్షేమమున యున్నవాడు.

అర్జు—మాయన్న నిజముగా బ్రతికియున్నవాడా!

శ్రీకృ—నిజముగా, నిక్కముగా, సత్యముగా.

అర్జు—(లేచి నిలబడి) అట్లైన యీ జాబేమి?

శ్రీకృ—అజాబట్లుండనిమ్ము యీ దివ్యదృష్టిచే మీయన్నను జూడుము.

(అర్జునునికన్నులు తుడుచును)

అర్జు—(చూచును) అన్నా! ధర్మరాజా నమస్కారము.

శ్రీకృ—యితడెవరో తెలియునా?

అర్జు—మాయన్న భీమసేనుని రథసారథి విశోకుడుగదా.

శ్రీకృ—కాదు! కాదు! వీడు నీచే జంపబడిన విద్యున్మాలి యనురక్కసుని తమ్ముడు రుధిరాక్షుడనువాడు దుర్యోధనుని ప్రేరితుడై యీ మాయపన్ని నిన్ను సంహరింప జనుదెంచియున్నాడు యీ నీచుని సంహరింపుము.

రుధి—హా! కృష్ణార్జునులారా రక్షింపుడు రక్షింపుడు.

శ్రీకృ—యీ దురాత్ముని ఖండింపుము.

అర్జు—యీ మాయచే వీడు నన్నెట్లుజంపును?

శ్రీకృ—దుర్వార్త విని దుఃఖముచే నీవు మూర్ఛిల్లుదువనియు అప్పుడు కత్తిచే నరికి సంహరింపవలయుననియు నీవన్నగద.

అర్జు—హరీ! తెమ్ము రక్షించమనుచున్నవాడు క్షత్రియధర్మ వ్యతిరిక్తముగా నెందుకు శిక్షించవలయు?

శ్రీకృ—అయిన వీని దక్షిణహస్తము మాత్రము ఖండింపుము. నిన్ను నరుకుటకు కత్తి నెత్తిన కారణము నే,

అర్జు—జగదీశ్వరుని యాజ్ఞ (అని వానికత్తి చేతనే వానిదక్షిణభుజము ఖండించును)

రుధి—అయ్యో! చచ్చితి, చచ్చితి (అనియేడ్చుచు పర్వెత్తును)

అర్జు—పరమపురుషా! దేవా, దేవా!

॥చూర్ణిక॥

శ్రీమద్వరదర్భాంగనా పయోధర చిత్రితమకరికాపత్రావ
లగ్న! లక్ష్మీసమయుతవక్షస్థల విరాజమానం భక్తజనమన
స్సన్నిధానం॥ ॥౧॥

బాలక్రీడా సమయగోఖుర సముద్ధూత భూపృష్ఠోత్థిత ధూళీ
ధూసరిత! రోలంబసన్నిభ కుంతలాచ్ఛాదిత ఫాలభాగం!
శంఖచక్ర గదాఖడ్గ శార్ఙ్గాలంకృత చతుర్భుజభాగం॥ ॥౨॥

అనర్ఘ్యమణిగణ ఖచితస్వర్ణమయకోటీ రాంతరవలమాన
మలయ! పవమానచలిత బర్హిబర్హావతంసం సంసారాది
భవభయవిధ్వంసం॥ ॥3॥

వసుదేవదేవకీ దేవీకృత పూర్వతపః కల్పశాఖ శాఖాంతం
పరిపక్వ ఫలాయమానం శ్రీమన్నారాయణం॥ ॥౪॥

మత్స్యకూర్మవరాహా ద్యేకవింశత్స్వయావతార కారణ
మహా విరాట్స్వరూప జఠరగోళ! పరిపోషితానేక కోటి
బ్రహ్మాండ భాండం శరణాగతా భయదాన ధారాపరా
కాండం॥ ॥౫॥

అఘోరతరకృతక శోకవార్తా శ్రోత్రియమాత్ర భయగ్రస్త
మదీయశంకా నివారణకారణకృత సాక్షాత్కారం గృధ్ర
రాక్షసదక్షిణ భుజాపహారం॥ ౬ ॥

శ్రీవిష్ణు పాధీశైశ్వర్యవర్ధిష్ణుం సమస్త సద్గుణాలంకరిష్ణుం
శ్రీకృష్ణం భజామి. ॥౭॥

(శ్రీకృష్ణుడానందముచే తలనాడించుచుండి)

శ్రీకృ—నిత్యకల్యాణవంతుడవై చిరంజీవివై వర్ధిల్లుము.

కం॥ అతిసుకుమారాంగుడవై
యతివేషముబూనినాడ వతులమనీషా।
గతమెద్దినాకు దెల్పుము
మతిసందియమొందకయ్య మానితశౌర్యా॥

అర్జు—త్రికాలవేదివగునీవు నన్నడుగవలెనా! నీకు దెలియనిదేమున్నది.

శ్రీకృ—సరి నీకార్యసాధనమునకై ప్రయత్నించెద పోదమురమ్ము.

(నిష్క్రమింతురు)

(తెరజారును)



## తృతీయాంకము—తృతీయరంగము.

### హస్తినాపురము.

సుయోధన—కర్ణ—శకునులాసీనులై యుందురు

దు॥ మ॥ అధిపాజ్ఞం గాని రాక్షసోత్తము
డరణ్యంబందుహుంకారస।
ద్బధిరీభూతదిగంతరుండగుచు
నుద్దండంబునం బార్థునిం।
వధియింపం గ నెనో వధింపబడెనో
వార్తాశ్రుతిం గ్రుంగెనో।
రుధిరాక్షుం డెటుసల్పెనో తెలియదే
దుర్యుక్తి నోమాతులా॥

హా హా! మనమాట యేమాయెనో?

శకు—అర్జునుని మాయ మొందించియుండును. మనప్రయోగాస్త్రము బ్రహ్మాస్త్రమువంటిదిగదా? సామాన్యమైనదా?

దుర్యో—మన విద్యున్మాలియే సంహరించియుండునా?

కర్ణ—యుద్ధమునందుగదా?

దుర్యో—ఔ! వతనికి మననిర్ణయమేగదా! యుద్ధము.

కర్ణ—యుద్ధమే జరిగియుండిన మన విద్యున్మాలి కిప్పటికి శ్రాద్ధము సహా జరిగియుండును.

శకు—కాని! సురియొకమాయా పత్రము.

కర్ణ—(నవ్వి) ఆమాయాపత్రము. రుధిరాక్షుని కంఠలతాసి పత్రమే.

దుర్యో—అయిన మనమేమిటికీ బ్రయత్న మొనర్చుట.

కర్ణ—పూరకుండుటకిష్టములేక, మన గాంధారమాంధాతి యీ కుసంధానమును సంధించియున్నాడు.

శకు—యేమికర్ణా! ప్రతివిషయమున కభ్యంతరకంఠశోషణ,

కర్ణ—అర్జునినొక వేయుమంది విద్యార్థులు లేకమైనను జయించుట సంశయము. ఒక విద్యార్థి జయించుట కలలోనివార్త. యిక మాయామాలేఖ యందమా, యిట్టిలేఖలు నూటయేబది సృష్టిచేసి లక్ష రథికాతురులైన నరశిక్షణం బున శిక్షించెడి వాసుదేవుడు వానికి తోడునిదైయుండ నేమిబ్రయోజనము. అర్జునిని సంహరింపవలెనన్న, రణరంగమునందు, నేనో, లేక పరశురాముడో. మాయిరువురిలో నొకరాతనిఁ ఘట్టించి యస్త్రప్రత్యస్త్రంబులఁ గుప్పించి, చిక్కబరచి, జయింతుము గాని, మీకు యోచనలు నిష్ప్రయోజనము. చాలునిక నోరుమూయుము.

శకు.—నీతో యోచించువారెవ్వరు. నోరెత్తిన నీ నాలుక గోయుదును.

కర్ణ—(లేచి) దురాత్మా, యీ ఖడ్గముచే నీ కంఠచ్ఛేదనం బొనర్చెదను.

(వరలోనుండి కత్తి సరాన బెరుకును)

శకు—(లేచి) సూతాధమా? యీ కత్తిచే నీ కుత్తుక గత్తరింతును.

(ఖడ్గము దూయును)

దుర్యో-(యిరువురికి అడ్డమునిలచి) యేమి? శకుని కర్ణులారా మీ రిట్లైన నా కార్యము.

శకు—దుర్యోధనా! యీ దురాత్ముడు సూతకులుడు. వీనికి సారథ్యంబొనర్చుట చేపలుబట్టుట, పక్షులగాల్చుట, వలలురులల్లుట, తెలియునుగాని రాజకార్యములేమెరుంగు నీదురాత్మునిఁ జంపకమానను. విడువుము, విడువుము.

కర్ణ—ఆడనారివలె గడ్డసాళ్లువేసి దుగదచ్చి, తీవంచ, యిత్తిక, భారా, యనిగవ్వలెంచుకొను కుటిప్రు జూదరికి, మోసము, టక్కు, మాయగాక యుద్ధమెరుగునా. ప్రతాపము దెలియునా. యేకార్యమునకు యీతని దర్శనము మార్జాలదర్శనమే విడువుమీ ద్రోహిని నీపాదములకు బలియిచ్చెద.

దుర్యో-చాలును! చాలును! కోపంబుమానుడు నామనవిఁ గైకొనుడు.

(శకుని కర్ణులు చేరియొకప్రక్కన గూర్చుందురు)

దుర్యో—శాంతమనశ్శాంతిగావినుడు. గార్గ్యమునీంద్రు డిటకరుదెంచి అయిదారు మాసములయ్యె నప్పుడు శుభద్రవ్యంబు లంపించియుంటిమి గాని మరల వచ్చుటి సమాచారము తెలుసుకొనలేదు. యిప్పుడు మరల శుభసామగ్రి నంపించి యోగక్షేమంబు లెరుంగవలయు. వివాహ విషయమే మేమి

యేర్పాటులైనది తెలుసుకొనవచ్చును యిందుకు మీరేమందురు యెవ్వరినం
పించవలయు?

(అంతలో అయ్యో! చచ్చితి! చచ్చితి! నని యేడ్చుచు రుధిరాక్షుడు ప్రవేశించును).

దుర్యో—హో! హో! రుధిరాక్షా యేమిసమాచారము?

రుధి—దేవా! అర్జునునిచే మాయన్న విద్యున్మాలి హతుడయ్యె నేనును జచ్చుచుం
టిని రాజనీతిపరుడు గనుక శరణన్న కరుణించి నాకుడిచేయినరికి విడిచె.

కర్ణ—రాజేంద్రా! చూచితివి. నామాటలు నిజమో యీ గాంధారమాంధాత
మాటలు నిజమో.

దుశ్శా—యిక నా విషయమెత్తకుడు మీకునమస్కరించి వేడుకొనెద.

దుర్యో—దానవా! ఆ యర్జునుడిచ్చట నేమిచేయుచుండె.

రుధి—ద్వారకకు దక్షిణ దిశయందర్ధయోజన దూరమున కదళీతరుషండమందలి
అమృత సరోవరకూలంబున సన్యాసివలెనుండె.

దుర్యో—అచ్చటనుండి ద్వారకకు బోయియుండునా?

రుధి—అప్పుడే కృష్ణుడువచ్చి నన్ను సంహరింపుమనియె నేను శరణన్న యింత
మాత్రము.

దుర్యో—కర్ణా! అటులయిన వారిరువురు ద్వారకకు బోయియుందురు మనముబోదము.

కర్ణ—యిపుడు మనకెందుకంతాతురము ధర్మరాజాదుల వివాహముకొరకై యీ
ముహూర్తమిప్పుడు నిలచినదికదా? మరియొక ముహూర్తనిశ్చయముచేసి
కొని వచ్చునమీదట పోవచ్చును.

దుర్యో—కర్ణా! కృష్ణుడు మాయావి. సుభద్ర అర్జునునకొసంగుటాతని యిష్టము,
గాని బయలుపరచక లోలోపలనే కుట్రలుచేయుచుండును. మనమచ్చటి
కేగి వారిచేతలకాస్పదము దొరకకుండునట్లు బ్రయత్నింతము. మితిమీరి
యుద్ధమేప్రాప్తించెనేని మనమందరొకచోగలసికొని యర్జునుని పని
బట్టింతము.

కర్ణ—యుద్ధమే తటస్థించెనేని నేను హస్తినాపురిలో నీవు ద్వారకాపురిలో.
అట్టిసమయముకే సెదుగుటయెట్లు?

దుశ్శా—యేల! నీవును, నేనును, వికర్ణుండును ద్వారకకు బోవుదము. కృష్ణుని

నడపడికె దెలసికొందము. బలభద్రునిమాట చెప్పవలదు. సమయమువేచి సుభద్రాహృదయము దెలసికొందము. తీర్థయాత్రకై అర్జునుడు ద్వారకకువచ్చియుండెనేని అతని విషయ మేరీతిపరిణమించునో యోచింతము మితిమీరెనేని బలవంతమున సుభద్రనెత్తికొని యరుదెంతము. ద్వారకయందునేనెప్పుడు శంఖారవంబొనర్తునో అప్పుడు నీవు బాణబాణాసనములతో బొందుపరచిన రథంబాయత్తపరచుకొనిరమ్ము. యుద్ధమో, సుభద్రాపహరణమో అప్పటికేది తటస్థమో యట్లొనర్తము. నే నొనర్చు శంఖారవము నీ వెరింగినదియేగదా.

కర్ణు—దేవా! నీవొనర్చు శంఖారవము సంజ్ఞ నాకు దెలియదా? చిత్తమట్లనే యొనర్తము.

దుర్యో—రుధిరాక్షా నీ ప్రాణంబులు రక్షించుకొని వచ్చినందుకు సంతసించితి నిక నీవు వెళ్లుము.

(రుధిరాక్షుడు నిష్క్రమించును).

దుర్యో—మాతులా! అర్జునుడు సన్యాసివేషముననుండు టెందునకు?

శకు—సన్యాసమా, మహాన్యాసమా సంవత్సరమునుండి తీర్థయాత్రావ్రతదీక్షితుడై యుండుట. అరణ్యసంచారమున బడలుట, తైర్థికవేషము, వుపవాసాదులచే నలయుట గని సన్యాసమనుకొన్నాడు రాక్షసులకేమి దెలియును.

దుర్యో—సరి మనమనుకొన్నట్లు జేయుదము.

(అందరునిష్క్రమింతురు).

అవనికబడును.

## ద్వారకాపురము. బయలుప్రదేశము.

ఢమ! ఢమ! ధ్వనిచేయుచు జాంఘికుడు బ్రవేశము.

ఇదిగో జనులారా! రేపటిదినమున రైవతకాచల యాత్రోత్సవ నిమిత్తమై అంతర్ద్వీపమున కరుగవలయునని శ్రీకృష్ణమూర్తిగారి యానతియైయున్నది సర్వులు తగుబరుతన్నములతో నుండవలసినది.

(మరల ఢమ! ఢమ! ధ్వనిచేయుచు నిష్క్రమించును)

———(O)———



శ్రీ

# సుభద్రార్జునీయము

## చతుర్థాంకము — ప్రథమరంగము

ద్వారకలో సుభద్రాంతఃపురము.

సుభద్ర మంచముపై గూర్చునియుండును.

సుభద్ర (౧౬ అనుబంధము)

ఉ॥ కోమలపుష్పబాణములు
కోవెలకీరులు సైన్యసంపదల్।
సోముడు స్నేహితుండుమది
ఝుమ్మనుతుమ్మెద బారినారియా।
రామమనుప్పరంబు నవురా యెటువంటి
మహానుభావుడో।
గోముఖవ్యాఘ్రమీమరుడు
గొబ్బున నేయుచునున్న వాడహా॥

ఆహా! అర్జునభూపాలుని తీర్థయాత్రానియమిత సంవత్సరము పూర్తియై యున్నది. యీమార్గముననే జనుదెంచునని నాసహోదరుఁడగు గదుడెరిగించె యింకను రాకుండుటకు గతంబెయ్యదియో నాకోర్కెకు భంగకారకుడు మా బలరామన్నగాక మరియెవ్వరుగలరు. నామనోనాథు డారోగ్యవంతుడై యెప్పుడు జనుదెంచునో, యెప్పుడు గాంతునో, యెచ్చటనున్నవాడో, దైవమా విరహమా నాకేమియో యోచనగానున్నది.

(కుముద్వతీ—వృత్సల బ్రవేశింతురు)

కు-వృ-దేవీ! వందనములు.

సు—కుముద్వతీ! పురిలో నేమివిశేషము ఢను, ఢను, ధ్వని వినబడెను.

కు—రేపటిదినమున రైవతకాచల ఈశ్వరోత్సవ నిమిత్తమై పౌరులందరు వెళ్లవలెనని శ్రీకృష్ణమూర్తిగారి యానతియట మనమును ప్రయాణసన్నాహముతో నుండవలయు.

సుభ—కావలసినవారుబోందు నాకాయాసముగానున్నది నేనురాను.

వృత్స—శ్రీకృష్ణమూర్తిగారియాజ్ఞ నిర్బంధమైనప్పుడు?

సుభ—అప్పటిమాటప్పటిది, యిప్పుడెందుకాయోచన?

కుము—దేవీ! మరియొకసంగతి. నేడు నాకుదెలిసియున్నది.

సుభ—యేమంతముఖ్యమైన విషయమా?

కుము—వివాహవిషయము.

సుభ—ఎవరికి?

కుము—నీకే మరియొకరివిషయము నాకెందుకు.

వృత్స—మరచితి అమ్మా నొక విశే . వచ్చియున్నాను.

సుభ—కాని! కుముద్వతివిషయము నివిశేషము రెండునుగానిండు.

కుము—ఓ! హో! వుండని తాళవే నీరంపును యిప్పుడేనా?

వృత్స—కుముద్వతీ నీకేమివేసటయో నామాటవినుటకు.

కుము—నేజెప్పువిషయమును వినునంతలో నే నీరావిడియా?

వృత్స—కానీనమ్మా! నీవిషయమేవింటానుగాని వివాహవిషయము నీకెట్లుదెలుసును. వరుడెవరు?

కుము—దుర్యోధనసార్వభౌమునకొసంగవలెనని బలరామదేవుడును రోహిణీదేవి గారును నిన్నరాత్రి సుమంగలీసౌధమునందను కొనుచుండిరి నేనువింటిని.

వృత్స—సరే! వరుడేమో వృత్తముండే మంచిదాంపత్యము.

సుభ—(కసరి) కుముద్వతీ నీవిషయము జాలింపుము. వృత్సలా నీవిశేషమేమో గానిమ్మ.

వృత్స—మన యుద్యానవనమునకొక్క యతీంద్రుడు వచ్చియున్నవాడు. నేనెందరినో యతుల ననేకసారులు జూచియున్నానుగాని యింత శృంగా

రసంతుండింత చిరుతప్రాయమున సన్యాసియైయుండుట నేనెందునుజూడ లేను.

సుభ—నీవెప్పుడుజూచితివి?

వృత్ప—మన పెంపుడుచిలుక దప్పించుకొనియుండె వెదకుచు నుద్యానవనమునకు బోయితిని అచ్చట మనసౌధద్రి సరోవరప్రాంత్యమునకు గూర్చుండి జపము సల్పుచుండె.

సుభ—వారుస్నానా' లానరంమటెచ్చట. సౌధద్రితీర్థమునందెవ్వరునుదిగరే?

వృత్ప—అమృత సరోవరమునందు.

సుభ—చిరుతప్రాయమంటివి, సన్యాసమంటివి. నేనమ్మలేను తైర్థిక వేషమో లేక యజ్ఞదీక్షయో యుండవలయు.

వృత్ప—యెవ్వరైనది తెలియనిదాననను కొంటివే నిక్కముగా సన్యాసియే.

సుభ—వారిపేరేమో?

వృత్ప—పూర్వాశ్రమమున నేమోగాని యిప్పుడుమాత్రము కృష్ణానంద స్వామివారట. త్రిశూలమెందోదాచి పార్వతిని కైలాసమందే విడచి ఫాలనేత్రమును భూతిపూతచే మరుగుపరచి మన ద్వారకాపురమును పునీతమొనర్పుటకై జనుదెంచిన సాక్షాత్శంకరునిబోలి యున్నవారు.

సుభ—మన ప్రద్యుమ్నునివలె నున్నవారా?

వృత్ప—వయసున [illegible] నాలుగైదేండ్లక్కువుండను గాని రూపమున మన ప్రద్యుమ్నులేబదిమందియైనను ఆమహాత్ముని సాటిగారు.

సుభ—మనముబోయి యామహాత్ముని దర్శనముచేసికొని వత్తుమా?

కుము—దేవీ! సన్యాసులనుజూచియుండలేదా దీనిమాటలకేమి చిరుతప్రాయముతో నున్నందున యతిపై మరులుబొడమి బొగడుచున్నది. కృష్ణమూర్తిగారి యాజ్ఞలేనిది మనమంతఃపురము విడచి పోగూడదు గదా.

సుభ—పోనిండు నాకేమో ఆయాసము గానున్నది. మీరిక్కడ రంపుచేయకుడు రైవతకాచల ప్రయాణవిషయమై ప్రయత్నము చేయుడు ఆయాసములేకున్న రేపు నేనును జనుదెంచెద యిప్పుడుకొంచము సేపు విశ్రమించెద.

(కుముద్వతీ—వృత్పల నిష్క్రమింతురు)

(సుభద్ర మనమునఁ దలఁచి) హా! నేననుకొన్నట్టే మా బలరామన్న యోచించి యున్నాఁడుగదా.

సీ॥ ననుఁబాయక ననుఁ గాయమును గాయముగఁ జేయు

చును కాయజుఁడు నేఁడు శూరుఁడాయె।

తనపెంపు దనయింపు గనిపింపకను జంప

గను తెంపు బూనగా కపటమిదియె।

యీ బేలఁ బూఁబాల నా బాలభూజాని

కీజాలననిరాము డెంచెనేమొ।

ఆభీరుభూదారుఁ డాకారవక్రుఁడు

దారగాఁగన్న నేదారిగందు।

యెవరనేమందు నే క్రియ నెటులనుందు।

నెట్లు నరుగందు చిరసౌఖ్య మెట్లు జెందు।

దనుచు నేనుందు నింకేమి దనియుచుందు।

నగ్రజా యెట్లు బ్రోచెదో యయ్య కృష్ణా॥

మనసా! నీ తరుణాదినరభూవిభునే వరియించి చిరసౌఖ్యంబనుభవించెదనని కొరగాని కోర్కెలు గోరుచుంటివి. దుర్యోధనునకొసంగెదనని బలరామదేవుడు నిశ్చయించియున్నాడు. అయ్యో! కంతువసంత జయంతాదులకన్న ను మిన్నయగు సుందరాకారుని, సముద్రగంభీరుని, మేరుసమధీరుని, కాదని ఖలుని, దుర్బలుని, దుష్టసంకల్ప హృదయోజ్వలుని, కురువంశదవానలుని వరింప దరమా! నావిభుకరగ్రహణంబొనర్చి శరచ్చంద్రచంద్రికాధవళ సౌధోపరి పర్యంకంబున శయనించు భాగ్యంబున్నదా. యిట్టిసుఖంబు రాత్రి స్వప్నంబునఁ గాంచితి స్వప్నప్రత్యాఖ్యకల కలు. కల్ల. కల్లశబ్దార్థమపద్ధము. అయ్యో అపద్ధంబైన నేమిగతి అనుష్టుడగు దుర్యోధను సప్తమగ్రహాధిపవదనం బేగతిఁ గాంతు గాంచి దౌర్భాగ్యత కెంతని దుఃఖింతు, దుఃఖించియెవరికిఁ దూరుదును, దూరియే కార్యంబొనరింతు నినియొక్కటియు ప్రయోజనములేదు. శ్రీకృష్ణమూర్తి యిష్ట మెట్లున్నదో యెరిగినపిదప దురాదృష్టసూచకంబయ్యెనేని యసువులుబాయ

ఎన్ని యుపాయము లుండవు. గరళము కరువైనదా! సరోవరంబులు లేవా! ఖడ్గము దొరకదా! నావేణియే నా కంధరంబునకు బంధించి సందేహంబు బాపదా? కృష్ణా! నన్ను రక్షింపుము జగద్రక్షకా.

(కుముద్వతి - ఉత్పల ప్రవేశింతురు)

కుము— దేవీ! రైవతకాచల ప్రయాణమునకు సన్నాహంబొనర్చి వచ్చితిమి.

ఉత్ప— అమ్మా! నీ ముఖ మేటికి వాడియున్నది.

సుభ— ఇప్పుడే నిద్రించి లేచినది.

కుము— నిద్ర లేచిన మోముగాదు నీవు భర్తృదారికవు భర్త కోరికచే విరహవేదనావిశయై యున్నట్టు తోచుచున్నది.

ఉత్ప— కుముద్వతీ! నీకేమి యామెతో సరసమా.?

కుము— ఆమెతో సరసమే నీతోనే విరసము.

ఉత్ప— నాపైనున్నదిలే నీకు.

కుము— ఉండనిమ్మా! ఉండ కుండనిమ్మా! యీమెకు మోహతాపమున ముఖమున విన్నదనము సూచించుచున్నది.

సుభ— చెలులారా! పరిహాసం బొనర్చుట కిదియే నా సమయము?

కుము— బలరామదేవుడు నీకు వివాహ ప్రయత్నంబొనర్చి యున్నవాడు. నీవింక పెండ్లికూతురు కాగలవు. పరిహాసమున కింతకన్న మంచి సమయ మెయ్యది.?

సుభ— ఆ లగ్నము భగ్నమౌరీయు మారకుండుడు.

(కుముద్వతి - ఉత్పల ఒకరి ముఖ మొకరు చూతురు.)

కుము— (యోచించి) సరి సరి తెలిసె. ఉత్పలా మన మీమె చెంతనుండియు నీమె మనోవృత్తి తెలుంగమైతిమి. మన కెరిగించుటకు సిగ్గుచే మిడుకుచున్నది.

ఉత్ప— ఏమి తెలిసినది.?

కుము— (ఉత్పల చెవిలో నేమియో చెప్పి) పోదమురమ్మా.

ఉత్ప— అట్లైన నామెతో జెప్ప వలసినదే.

(సుభద్ర నిట్టూర్పున) పాండవులకు (అని శయనించును.)

(కుముద్వతి - ఉత్పల నష్క్రమింతురు.)

(అవనిక బడును).

## చతుర్థాంకము. రుక్మిణీదేవి యంతఃపురము.

(రుక్మిణీదేవి కూర్చొనియుండును. కుముద్వతీ – ఉత్పలచెలి యొక ప్రక్కన నిలిచి వింజామరములు వీచుచుందురు.)

రుక్మి— చెలులారా! మా సుభద్ర.

మ॥ వరునిఁ గోరిన వృత్తి నేనెఁగుటుదుఁ మావారలా కౌరవే।
శ్వరుతో వియ్యమునొందఁ గోరిరిక నెవ్వారమ్మ జెప్పంగనే।
ర్తురు వీరల్ దగ జేయు కార్యములచే దుర్మార్గకంబానొ నా।
మరదల్ యంచు జనించె భీతి హరినిఁ బ్రార్థించి యోచించెదన్॥

(శ్రీకృష్ణమూర్తి ప్రవేశించును.)
(రుక్మిణీదేవి లేచి నిలచును చెలులు రుక్మిణీదేవి వెనుక నిలతురు).
(శ్రీ కృష్ణమూర్తి కూర్చుండును).

కృ— దేవీ! ఏమి యోచించుచున్నదానవు.?
రుక్మి— మన సుభద్ర విషయమై.
కృ— సుభద్ర విషయమై యోచనయేమి.

రుక్మి— మత్తకోకిలా వృత్తము.

వాసుదేవభవత్సహోదరి వారిజాక్షి సుభద్రకున్।
భాసురంబగు లగ్నకాలము ప్రాప్తమాయెను జూడగా।
నే సుశీలున కిచ్చి లగ్నము నేర్పరింప దలంతురో।
హాసమెంచ కెటుంగ జేయు విభో సురేశ దయానిధే॥

కృ—

మత్త॥ కామినీ కురువంశమాళికి కాంతనిచ్చెద నంచుమా।
కామపాలుడు నిశ్చయించెను గాన యోచన యేటికే।
యీమహీనవఖండ ధారుణి కీశుడాతడు గావునన్।
భామినీమణి భాగ్యమున్నగ బ్రహ్మ కైనను శక్యమే॥

రుక్మి— సంతోష మాయెను.

కృ— ఏ మట్లనియెదవు.?

రుక్మి— మీకు దెలియని దేమున్నది. మీ చెల్లెలు ప్రాణత్యాగం బొనర్చు కొనును.

కృ— ఎందుకు.

రుక్మి— కం॥ నరుఁడే వరుఁడని పరిపరి॥
తెరఁగుల మరులొందు చుండ దెలిసియు మీరీ।
వెరవున కురుపతి కొసగిన।
తెరవకు నిక బ్రతుకు గలదె దెలియుము నాథా॥

ఆ దుర్యోధనున కొసంగుటకు మీ రెట్లు సమ్మతించితిరి ?

కృ— సమ్మతింపకున్న మా బలరామన్న గారికి బదులాడుట కెట్లగును.?

రుక్మి— మీరును మీయన్న గారి మార్గము నే బట్టినట్లున్నదే.!

కృ— నీకు సమ్మతి లేక నెంత ప్రయోజనమైనా నాకు సమ్మతి లేకుండ నంతియే ప్రయోజనము.

రుక్మి— అదేమి! మా బావ గారికేనా చెల్లెలు? మీకు చెల్లెలు గాదా? ఆమె కష్ట సుఖములు విచారించు బాధ్యత మీకు లేదా? ఆమె యిష్టం బెరుంగవలదా? మన మేమి క్షత్రియులము కామా? స్వయంవరం బేల నొనరింపరాదు.?

కృ— ఏ విషయమునకు మాయన్న. యొప్పవలె గదా.?

బల— మీకే ఆమె విషయమున స్వాతంత్రము లేకున్న మా బావగారికి మాత్ర మంత స్వాతంత్ర మేమి ?

కృ— ఆయన పెద్దవాడు.

రు— ఆయనకన్నా పెద్దవారైన మా మామగారును మా యత్త గారును వున్నారు గదా.!

కృ— ఉండినను నాకేమో పెద్దవాడే! అందున పితృసమో జ్యేష్ఠ యను న్యాయమున ఆయన వాక్యమె నాకాదరణీయము.

రు— (కోపగించుకొనకుడు మనవి) తల్లిదండ్రుల వాక్యమైనను కడద్రోచి అగ్రజువాక్యమె ప్రాధాన్యమని యెంచుట దేమిన్యాయము.

కృ— నా తల్లిదండ్రులీవిషయమై మాతో నేమియుఁజెప్పలేదే.

రు— మీరు వారినడిగినఁజెప్పెదరా? అడుగక నే చెప్పెదరా?

కృ— అడుగుటకు అడుగకుండుటకు మా యన్నయే యధికారియని నే నప్పుడే చెప్పలేదా? యిదిగాక గృహకార్య నిర్వాహకం బంతయు మా జననీ జనకు లాయనపైననే వైచియున్నారని నీకుఁదెలియదా!

రు— అట్లని మీరే కార్యమునకు ముందంజ వేయకుందురేని మిమ్మీ విషయ మెచ్చరించియుండను. మీ కిష్టమగు కార్యముల కన్నగారి నడుగుట లేదు. అయ్యగారి నడుగుటలేదు. ఇష్టములేని కార్యముల కన్నగారి మాట నడ్డమువైచెదరు దుర్యోధనున కొసగుమాటయే నిశ్చయమాయె నేని సుభద్ర జీవించుట నమ్మకము లేదు. కుముద్వతీ వృత్తులలామె పరితాపము జెప్పియుఁ జెప్పలేరు. మగవారలకేమి తెలియును.

కం॥ అన్నముఁదినదఁట నీరం। బన్నోకడ జేర్పదంటపా
యనునఁటయొ। న్నెన్నియొ కలువరపడునఁట।
యన్నెలఁతుక బాధ జెప్ప నలవియె నాథా॥

కృ— ఈ బాధయంతయు దుర్యోధను కొఱకేనా? ఏమో!

రు— దుర్యోధనుని కొఱకే! ఆ పాపాత్ము డింకను నశింపగాలేదే యని

కృ— (నవ్వి) ఓహో! యేమి నేడునీకు మహిషాసురమర్దని స్వరూపము వచ్చియున్నదే దేవీ! చింతింపకుము నీ హృదయం బెరుఁగనట్టింటి నేనా దుర్యోధనుని పేరన్న సహింపకుండు నింక నా చెల్లెలి నతని కొసఁగుటకు సమ్మతింతునే, మా బలరామన్నగారి యెదుట వారియిష్టానుసారమె మాటలాడవలయు. నందున మనకార్యమున కేమి భంగ మొదవు. మనయర్జునుడు తీర్థయాత్రలొనర్చి సుభద్రను వరించుటకై నా నియోగమున యతిరూపముఁ ధరించి మన యుద్యానవాటిక యందున్నవాడు. సుభద్ర అర్జునుని భార్యయేనని నిశ్చయముగా నమ్ముము. యతిసేవ లొనర్ప సుభద్రనే నియమింతుము. అతఁ డర్జునుడని తెలిసి సుభద్ర సేవ కరుగకుండదేని నీవు పోయి భోజన పానంబుల తృప్తినిఁ జేసిరమ్ము ఊరకుండకుము. ఈ విషయము రహస్యముగా నుంచుకొనుము. చెలులారా! తుదకీ రహస్యము సుభద్రకైనను దెలియనీకుడు.

రుక్మి—ఆహా! మాయన్న వచ్చియున్నవాడా? పోయి చూచినచ్చెదను ననుజ్ఞయొసంగుడు.

కృ—రహస్యముగా బొమ్ము బయలుపరచకుము బలరామన్నకు దెలసెనేని కార్యమున కంతరాయములు కలస్త్రింమను నేజెప్పియున్నాను మీయిష్టము.

(కృష్ణమూర్తి నిష్క్రమించును)

రుక్మి—యిదే నేనును మాయన్న దర్శనంబొనర్చి జనుదెంచెద చెలులారా రహస్యమును బయలుపరచక సుభద్రికెరింగింపక గుప్తపరుపుడు మీయిష్టము

(రుక్మిణీదేవి నిష్క్రమించును)

కుము—వుత్పలా! నీవన్నమాటనిజమే ఆ యతిరూపవంతుడని నీ వనలేదా? అర్జున భూపాలుడైనందుననే ఆశృంగారము గల్గియుండవలయు నిక మన సుభద్రమనను భద్రమగును.

వుత్ప—ఆమెకు జెప్పవద్దు.

కుము—అబ్బా నీవే బుద్ధిమంతురాలవు నేను నవివేకురాలను గాదులే.

వుత్ప—తెలియనివారిరీతి నటించుచుందము.

కుము—యిక బోదము మనదేవి లేచియుండును.

(ఇరువురు నిష్క్రమింతురు)

తెర బడును

---

## చతుర్థాంకము—తృతీయరంగము.

(వుద్యాన వనము—యతి గూర్చొని జపముచేయుచుండును)

రుక్మిణీదేవి ఫలహారద్రవ్యములతో ప్రవేశించును)

ఆహా! యేమి యీ యతీంద్రుని యచలభావము.

మ॥ అరిషడ్వర్గములన్ జయించి

మనమందానందమున్ నించి భా।

సురసత్కేశ జటాతటంబుకుశయున్

శుభ్రంబుమైపూతయున్।

వరరుద్రాక్షసరంబులున్ మెరయ

దివ్యస్థాయుడై నట్టి శ్రీ।

పురసహ్మరునిబోలినాడుగద

యీ పుణ్యాత్ముడాత్మభుడై॥

ఔరా! అచలతురీయ సమాధియందప్రబోధుండైయున్న సాధకుల్బోలె యోగంబు సాధించుచున్నవాడు దర్భాస్తరణంబుపై యుదక్పూర్వదిశాభిముఖుండై కించిన్మీలితలోచనుండై జపసరంబునన్ద్రిప్పుచు పద్మాసనాసీనుండై యచలశరీరుండై యోగవాగంబును కకపాలంబును రుమరాక పేసులును భస్మధారణంబునుజూడ నిక్కపు సన్యాసిన్బోలియున్నవాడు.

కం॥ సతులన్ సంసృతికారణ

మతులన్ మదిరోసిగాదె మనుజుల్ యతులై।

క్షితిలో వెలయుదురితడా

సతికై యతియయ్యెనిట్లు జగతిన్ గలదే॥

(ఫలపదార్థంబు లెదుటనుంచి)

రుక్మి—యతీంద్రా వందనములు.

అర్జు—(మౌనంబుననుండును.)

రుక్మి—యతిచంద్రా.

అర్జు—(కన్నుదెరచి) శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

రుక్మి—దేవా! వందనములు.

అర్జు—సుఖీభవ! సుఖీభవ! దీర్ఘసుమంగలీభవ.

రుక్మి—ఈ పూజాద్రవ్యంబులు ఫలహార ద్రవ్యంబులు గైకొనుడు.

అర్జు—ఆ దర్భాసనంబుపై నుంచుము.

రుక్మి—అన్నయ్యా! తామెచ్చటినుండి విచ్చేసితిరి?

అర్జు—యత్యాశ్రిమంబున నున్న మమ్ము వావివరుసలతో బిలువతగదు కుమారీ!
రుక్మి—యింకేమని బిలువవలయును?
అర్జు—లోకజ్ఞాన శోభితవైన నీ కెరింగింపవలెనా! యతీంద్రా యనియు, దేవా
    యనియు, మహాత్మా యనియు బిల్వవలయు.
రుక్మి—స్వామీ యని బిల్వవచ్చునా?
అర్జు—నిరభ్యంతరముగా.
రుక్మి—యే స్వామియని బిల్వవలయు?
అర్జు—కృష్ణానంద స్వామియని.
రుక్మి—అదేమి పది పేర్లువిడచి పదునొకండవ పేరుపై అంతానందము?
అర్జు—పది యేయ్యవి పదునొకొండెద్ది?
రుక్మి—అర్జునః ఫల్గునాదులు పది కృష్ణయనునది పదునొకండు.
అర్జు—సహోదరీ! నీవు లోకమాతవు నీకు దెలియని రహస్య మెచ్చటగలదు.
రుక్మి—(నవ్వుచు) ఓ! హో! తాము యత్యాశ్రమంబుననుండియు మమ్ము వావివరు
    సల పిలువకూడదు గదా యతీంద్రులవారూ.

అర్జు:—

కం॥ జగదేకమాతయానీ
కగుపడని రహస్యమెద్ది యానిటనున్నన్।
రగడయగుబలుదెరింగిన
సుగుణమణీ జనుము శీఘ్రి చోదితగణివై॥

రుక్మి. (౧౭ అనుబంధము)

రు॥ గీ॥ తీర్థయాత్రలుసల్పితే సార్థకముగ
కపటసన్యాసివేషంబు గాంచియున్న।
అన్ననాపుణ్యవశమున నిన్నుగంటి
సంతసంబాయెనీరాక సవ్యసాచీ॥

అన్నయ్యా! ఇత్తఱి యత్యాశ్రమంబవలంబించుటకు మనకు భద్రమేనా?

అర్జు—మనకు భద్రము కొఱకే యతివృత్తి.

రుక్మి—యత్యాశ్రమంబవలంబించి నీవొనర్పు తపంబునకు మీ చిన్నబావగారు శీఘ్రమున కార్యసిద్ధి నొనర్తురు. నేను పోయివచ్చెద, భోజనపానంబుల దృప్తుండవగుము.

అర్జు—జగదేక మాతవగు నీ వాక్యమున కన్యథాగల్గునే, పోయిరమ్మా. రహస్యమును బయలు పరచకుము.

(రుక్మిణి నిష్క్రమించును)
అంత రావనిక బడును.

## వనములో రంగపార్శ్వ భాగము.

### కృష్ణబలరాములు ప్రవేశము.

బల—సోదరా! యీవనముఁ జూచితివే?

మ॥ సురసాలామ్రక పిత్థనింబ బదరీ
చూతార్జునాశ్వత్థ ఖ
ర్జుర తాలాగరుబిల్వలుంగ కుటజ
స్ఫూర్తిఁ లతాంతామలో।
ద్ధుర పుష్పాంతరధూళిధూసరిత ని
ర్దుష్టానిలాశోకకుఁ।
తరవానూనవిశేష వైభవ మహా
నందంబుగా దోచెడిఁ॥

మధురస ఫలంబులఁ భక్షించి శుకంబులను పల్లవంబులఁ మెసవి పికంబులును కలకల ధ్వనులు సల్పుచున్నవి. పుష్ప మకరందంబునఁ గ్రోలి తుమ్మెదలు గీతంబులు బాడుచున్నవి. మనోజరాజ్య పట్టాభిషిక్తులౌ వధూవరుల హృదయానుమోదంబగు నిట్టివనంబులందుగాదే తొల్లిటిమునులు రంభాదులఁ గాంచి మానంబులు వీడుట తపంబులు ధారవోయుట (నేపథ్యమున శ్రీరామా, వాసుదేవా, గోవిందా యను ధ్వని)

బల—(ఆశ్చర్యమున) హా! ఇచ్చట నీ యపూర్వానందము.

(తలుపుసి కృష్ణుఁడు గాంచును) (ఖరం)

(౧౮ అనుబంధము)

మలయమారుత వృత్తము.

మనసిజ సుందర మణిమయ కంధర మనుకుల భాసుర
మండనదా।
కనకమయాంబర ఘనగుణమందిర కనకదృగాసుర
ఖండనదా।
వనరుహలోచన వనధినికేతన ఫణిపతితల్ప
ప్రభావవధా।
యినకులపావన హితయుత భావన హిమకర కీర్తి
దిగీశ హరీ॥

బల—కృష్ణా! యిచ్చట నీ యపూర్వనాదము?

(వెనుక నవనిక యెత్తఁబడును)

(యతీ దర్భాసనంబుపైఁ గూర్చొని దేవారాధనంబొనర్చుచుండును.)

బల—(చూచి) ఓహో! పరమ యతీంద్రులు వచ్చియున్నవారే!

గీ॥ కర్మ ధర్మ ప్రజైశ్వర్య కామభోగ।
రాగరాహిత్యమైయున్న బ్రహ్మమిదొ।
యదియె సాక్షాత్కరించిన యట్టులుండు।
పరమయోగి వరేణ్యులఁ బ్రణుతిఁ జేతు॥

(నమస్కరించును)

కృ—

కం॥ వేదాధ్యయనరతులై।
వేదాంతపురాంత సౌధవిహారం బెనసి।

ఖేదంబో బ్రహ్మమయా।
ప్రాధాన్య మహేశ్వరాత్మ ప్రవ్రజుదలంతున్॥

(నమస్కరించును.)

అర్జు—నారాయణస్మరణ, నారాయణస్మరణ.

బల— స్వామివారి రాక యెచ్చటినుండికో విమర్శింపవలయును.

అర్జు—గోకర్ణ క్షేత్రమునుండి.

కృ—నామధేయము వినఁదలచి యున్నాను.

అర్జు—కృష్ణానందయతి యందురు.

కృ—ఇచ్చటినుండి స్వారి యెచ్చటికో.

అర్జు—గోవర్ధనాద్రికి.

బల—యతీంద్రా! చాతుర్మాస్యము స్వామి యిచ్చట నే నిలువవలయు.

కృ—అట్లొనర్పుఁడు మాకేవిషయమునఁ గొఱఁత యుండదు.

అర్జు—పరేంగితజ్ఞాన పారీణులగు మీ రెంత సెయ్యదియు కొఱవలేదనిరే గదా
యిచ్చటికి మా రాక.

బల—కృష్ణా! యీ మహాత్మునకు సేవ యొనర్చుటకును భిక్షనొసంగుటకును
పూజాద్రవ్యములు సమకూర్చుటకును మనసహోదరి సుభద్రను నియ
మింపుము. వీరియానతిమేరకు వర్తించునట్లాజ్ఞ నిడుము.

కృ—(అపవారించి శాంతినముగా)

కం॥ ఇరువురు తరుణ వయస్కులు।
వరరూపస్ఫురణ పరులు భావ్యంబగునే।
పరులయెడఁ గాంతను నుంచుట।
గురుఁడవు యోచింపుమన్న కోవిదమతివై॥

బల—

మ॥ తగునే మాధవ యిట్టు లాడమును తత్వజ్ఞాన
పారీణులై। నిగమాంతాదిక యోగభావులగు
మానీంద్రార్చనాన్వృత్తిలో। మగువల్ వర్తిలరే

మహాత్మ్యఁ గిపుడీ మాన్యుండు సేవార్థమై। మృగ
రాణ్మధ్య సుభద్ర సంప్రమదిక శ్రేయంబు బెం
పూరెడిఁ॥

కృ—తమచిత్తము! యతీంద్రా సెలవొసంగవలయును.

బల—ఆజ్ఞ గైకొనియెద.

కృ—శివ సేవార్థమై మా సుభద్ర జను దెంచును వలయుపదార్థము లేకొదవ లేక
తెప్పించుకొని వ్రతంబు సాంగంబొనర్చుకొనుడు.

ఆర్జు—(శ్రీ) రామాయనమః.

(కృ—బ— నిష్క్రమింతురు).
అవనిక పడును.

పంచమాంకము ప్రథమరంగము

దేవాగారము.

(గౌరీదేవి నలంకరించి యుందురు)

(సుభద్ర గౌరీదేవి నర్చించుచుండును)

(సముద్యుతి, ఉత్పల, ప్రక్కన నిలచి యుందురు)

సుభద్ర ([illegible] అనుబంధము)

సీ॥ సర్వమంగళ నీదు చరణాబ్జములె నెంతు।
విజయుని భర్తగా నింపుమమ్మ।
పాపి దుర్యోధను భార్యజేసిన ప్రాణ
వాయువుల్ బాతు నీ భాగమమ్మ।
బలరామునకు నెంత పాపపుణ్యము లేదొ।
కౌరవేశునకిడఁగోరెనమ్మ।
పలుకోర్కెలెల్ల నీపై వైచియున్నాను।
పుత్రికగ నన్ను బ్రోవుమమ్మ॥

గీ॥ నీ వెఱుంగని దెయ్యది నిక్కమమ్మ।
సర్వలోకంబులను గాచు సత్యవమ్మ।
కోర్కెలొసగెదవని నిన్ను గోరితమ్మ।
కరుణజూడవె మాయమ్మ గిరిసుతమ్మ॥

జగజ్జననీ నా ప్రార్థనకు భక్తియో, చింతయో, కామమో, ప్రేమయో, యేది ప్రాధాన్యమో యెరుంగకున్నదాన. నా గ్రాహక ప్రార్థనకై హృదయ పరిపూరితాశేష విషయంబుల గమనించి నా విషయము పోలుతో వెలువరించుటకు నా కోర్కె లధికంబు లగుటచే దెంతు సహింపలేక నిశ్చయించుకొనుశక్తి జాలక మిడుకుచున్నదాన. సీదియు నా యత్నంబుగాదు. నా పూర్వకృత దుష్కృత ఫలితాశన సంభవ చింతా ఘూర్ణమానంబు నే వెల్లడింపకున్నను సకల భూతాంతర్వ్యాపిత్రి యగు నీ వెరుంగవే మాతా! యిక నీయిష్టము. నా కృష్ణమూర్తి యిష్టము. కరుణా రసామృత తరంగంబుల నాపై బ్రసరింప జేయుము భవానీ-శర్వాణీ-మాంపాహి.

కుమ—దేవీ! యింత చింతగుందనేల. కాగల కార్యములు కాక మానవు.

ఉ—బలరామ దేవుఁడిచ్చెదనన్న మాత్రమున నే మించిన దేమున్నది. వివాహమై దుర్యోధన మహారాజుగారి కౌగిలిలో జిక్కినప్పుడుగదా యోచించవలయు.

కు—వివాహమైన పిమ్మట యోచింప నేమి?

ఉ—అదే మట్లెరుగవు? స్త్రీజనులు చపలలను మాట పాసోక్తియా? నవఖండ మహీమండలాఖండలుండగు యమ్మహారాజు భార్యనై దేవేంద్ర వైభవంబున నిండోలగ మందున్నప్పుడీ బుద్ధి నిలుచునా. తీర్థ ద్రిమ్మరినై శుష్కోపవాసముల గృశించిన యా కర్రినిగన్న నిమెకు నిస్పృహ జనింపకుండునా, యెందుకొరకు యువతిని దూషింపవలయు?

సు—చాలు లేవే నీకేమి! యెవరినిగన్నను యేమేమియో సంకల్పములుఁ బుట్టు
చుండును. మన యుద్యానవనమునకొక్క యాఁ వచ్చినాఁడనియు చిరుత
ప్రాయముననే యతియైనాఁడనియు కొంత శృంగార వంతుఁడనియు నీ
వానా చెనలేదో. యానే నీవంతగా మోహించి వర్ణించితివి. యింక
క్షీణపుణ్యనిగన్న నీ మనసుకి మితమున్నదా? నీవే సంశయ చిత్తవు. నీ యొక
దానినుండి యే స్త్రీ జనులందరు చపల చిత్తలని నిందనుఁబొల్చుడిరి.

ఉ—సుముద్వతీ! లోకాభిరామముగా నే నాయనని వర్ణించితినిగాని నీ వనుకొన్నట్టు
గాదు. నీ కిష్టమున్న యా క్షేపణైనను గవయుము. యతిపతినైనను
గోరుము. నేనంగుల కాక్షేపణ కర్తను గాను గదా!

సుభ—చెలులారా మీకేమి పొద్దుపోదో? మీ తగవులెప్పటికి నెడతెగవు గదా!

సు—అమ్మా! యీ యుత్పల రంపునకు నేనుఁ దట్టుకొనలేను దీనితో నెప్పుడును
నాకు తొందరయే. మీ రిరువురే యుండుడు. అది యాసురపతినిఁ గట్టుకొనని
నీ వాయతిపతిని గట్టుకొనుము. నాకేమి చింత. రుక్మిణీదేవిగారు పిలచు
చుండిరి. నేఁబోవలయు.

(పోబోవును)

సుభ—ఏమి సుముద్వతీ! యీమీ వాక్కలహము తుదకు నాపైఁ బ్రయోగించితిరే!

ఉత్ప—పోనిలెమ్మా, యొంగుకంత బ్రతిమాలెదవు?

సుభ—సుముద్వతీ! సుముద్వతీ! (అని పిలచుచుండ నిష్క్రమించును).
ఉత్పలా! యేమే యీ శుష్క వాక్కలహము.

ఉత్ప—పోనిలెమ్మా, యీదినము బిగువుగానుండును. పల్కరింపకున్న రేపు
జముచెంచును. ఆమె నెవరేమనిరి. దీనిముంగోప మెప్పుడును జూచినదే
కదా!

సు—

చం॥ చెలులని నమ్మి సందులకు చింతయు వంతయు
మీఱుగనట్టుగా।
కలహము బూని నాపుదిని కారియబెట్టితి
రేమి సేయుదు।

పలుకులు సన్నుతించి చెలిఁ బ్రార్థన జేసియుతో
తోడితేవె యు।
త్పల! సుగుణాఢ్యనై జనము ప్రస్తుతిజేసెద నన్ను
నెచ్చెలీ॥

చె— నీ యానతిమేరకు పోయి వచ్చెద.

(నిష్క్రమించును)

సు— ఆహా! యీ చెలుల తగవులా, అబలని తెగువలా యేమిచేయుదు.

చేతులు జోడించుకొని (౨౦ అనుబంధము).

సు.—(నిట్టూర్పు విడిచి) అన్నా! కృష్ణా! నీయిష్ట మెట్లున్నదో! నీవే దిక్కు, నేనబలను. నీ మొఱపెట్టుదానను. రక్షింపుము. నాకోర్కె నెరవేర్పుము.

(శ్రీ కృష్ణుఁడు ప్రవేశించును)

(సుభద్ర నమస్కరించును)

కృ— ఈప్సితార్థ సిద్ధిరస్తు — సోదరీ! నీ ముఖమేటికి వాడియున్నది!

సు— అన్నయ్యా! యిప్పుడే నిద్రించి లేచినది.

కృ— మన యుద్యానవనమునకు యతీంద్రులు వచ్చియున్నారు. వారిసేవ యొనర్చుటకై నిన్ను నియమింపవలెనని బలరామన్నగారానతి యొసంగి యున్నారు. నీ విప్పటికిఁ జని వలయు పూజోపకరణంబులును, ఆహార పదార్థంబులును; ఇచ్చి వారి యానతి నీవు వర్తింపుము.

(శ్రీకృష్ణుఁడు నిష్క్రమించును.)

సు— నే నా యతీంద్రుని దర్శన మొనర్చుకొని రావలయునని యుంటి. తలవని తలంపుగా మాయన్నయే నాకాజ్ఞ యొసంగి యున్నవాఁడు, పోయెద. చెలులింకను రాలేదు కొంచము తడువు విశ్రమించెద.

(శయనించును.)

(అవనిక బడును.)

## రంగపరిసర భాగము.

(ఉత్పల ప్రవేశించి) సముద్వతీ — సముద్వతీ (అని పిలుచును).

(సముద్వతి నవ్వుచుఁ బ్రవేశించును).

ఉత్ప — ఎందుకట్లు కోపగించుకొని వచ్చితివి?

సము — ఎప్పుడును నిరంపుఁ బడలేక.

ఉత్ప — ఎన్నియోమారు లింతకన్నా నెక్కువగు హాస్యమాడినప్పుడు కోపగించ కొనలేదు. నేఁ డీస్వల్ప విషయమున కింత యేలఁ తుదకు సుభద్రనైనను లెక్క సేయక వెడలితివే.

సము — ఇదియొక నాటకము. పురమందు జరుగు రహస్యములు యతీంద్రుఁడనును. అన్నమాచార్యుఁడు చెప్పు మర్మములు తనకుఁ దెలియఁజేయుటకై యాయనవద్ద సేవ జేయుచుండు దానినని నాకుఁ దెలిపెనని శ్రీకృష్ణమూర్తిగారి యాజ్ఞచే సుకృతిగేవి నాకొసంగించె. నీసంగతి సుభద్రకు దెలియనీయవుగదా! అందుచే నిట్లు కొంత కలహము కల్పించుకొని జనవెంచితిని గాని నీపైన నాకు కోపము గలదా! (అని యొకరిచే యొకరు బట్టుకొందురు.)

ఉత్ప — అంగలకా! సరిసరి, అట్లైన యీ నాటకమునకు పేరెయ్యది?

సము — (నవ్వి) సుభద్రార్జునీయమని.

ఉ — బాగున్నది. కాని, సుభద్రతో నేనేమి చెప్పుదును?

సము — నీ కెరుగింపుదాననా నాబోటి జడమతుల కెరుగింపుదానవే, ఉత్పలా!

ఉత్ప — నీ స్తోత్రమున కేమిలే.

సము — ఇక నేఁబోవలయు.

ఉత్ప — నేనును వెళ్లెద. సుభద్రతో నేదో యొకటన్నఁ జెప్పెద.

(చెరి యొక ప్రక్కగాఁ నిష్క్రమింతురు).

(వెనుక యవనిక నెత్తబడును.)

## పంచమాంకము. — ద్వితీయ రంగము.

(యతి కృష్ణాజినముపై గూర్చొని జపము సల్పుచుండును.)

(సముద్వతి పూజాద్రవ్యములతోఁ బ్రవేశించును.)

సుము — యతీంద్రా! వందనములు.

అర్జు — (కన్నులు మూసుకొనియే తనలో) సుభద్రయే వచ్చి యుండవలయు.
(ప్రకాశముగా) కల్యాణమస్తు.

సుము — బలదేవు నాజ్ఞచే రేవతీ దేవిగారు ఫలాదుల నంపించియున్నారు.

అర్జు — ఆపర్ణ పుటికలయందుంచుము.

సుము — తమ సేవకు సహా నన్నే నియమించియున్నారు.

అర్జు — (కన్ను తెరచి చూచి ఆతురమున) మా సేవకై సుభద్ర నంపించెదమని చెప్పిరే,
మరల నిన్నేలనంపిరి?

సుము — మీబోటి మహనీయులను గాంచిన మాయాదవులందరికిని పరమభక్తి.
సుభద్రాదేవి సుకుమారి యగుటచే, ఆయాస పడినప్పుడు. తమకు వలయు
సామగ్రులు సమకూర్చుటకు నన్ను నియమించి యున్నారు.

అర్జు — అంతటి యాయాసమగుట వరకు నాపనికై నేనేందుకు నియమింతును?

సుము — ఏమో నాకా సంగతి తెలియదు. వారు చెప్పిన మాటయే సెలవొసంగిన
కొంతదడవు. నిద్రించి జనుదెంచెద. రాత్రియల్లయు నిద్రయే లేదు.

అర్జు — రాత్రేందుకు నిద్ర లేదు?

సుము — తమ కావిషయములతో ప్రాజా కాలాతీతం బౌనేమోనని విన్నవించుటకు
జంకు చున్నదాన.

అర్జు — తెలియజేయుము, భయపడకుము.

సుము — మా సుభద్రాదేవిగారి వివాహ విషయమై యోచించుచుండుటచే

అర్జు — బలరామ కృష్ణుల సహోదరియైన సుభద్రా వివాహ ప్రస్తావన విషయమే
గదా నీవు చెప్పునది.

సుము — చిత్తము.

అర్జు — వరుడెవరు?

సుము — దుర్యోధన చక్రవర్తిగారి కొసంగవలెనని బలరామ దేవుడును, అర్జున
భూపాలున కియ్యవలెనని దేవకీదేవిగారును కలహించుచుండిరి. కృష్ణమూర్తి
యేమియుం జెప్పలేదు. ముఖ్యముగా మా సుభద్రాదేవి మిక్కిలి సుందర
వంతురాలు. అందుచే నీ కలహమునకు కారణమగుచున్నది.

అర్జు—శృంగారమునకు కలహమునకు నేమి సంబంధము.

సుము—శృంగారవంతురాలైన సుభద్రను శృంగారవంతుఁడును, శౌర్యవంతుఁడును మేనల్లుఁడు అయిన అర్జునున కొసంగవలెనని దేవకీ దేవిగారికి యిష్టము. మహదైశ్వర్యవంతుఁడనియు, సార్వభౌముఁడనియు, దుర్యోధనున కొసంగవలెనని బలభద్రుని యిష్టము. ఇదియే కలహము.

అర్జు—అర్జును డైశ్వర్యవంతుఁడుగాఁడా! సార్వభౌముని తమ్ముఁడుఁగాఁడా? వారి యభిప్రాయమేమో? పోని తుదకెవరికొసంగుటకు నిశ్చయించిరి.

సుము—వారిట్లు నే కలహించుచుండ విని విని నాకు వేసటయై అర్జునున కిచ్చుట కన్నను, ఆ యతీంద్రున కొసంగుట మేలని చెప్పితిని. ఆమాట యోచించి తుదకు దుర్యోధన మహారాజున కిచ్చునట్లే నిశ్చయించిరి.

అర్జు—(బొమలు ముడివైచుకొని (జూచి) నీచురాలా! మమ్ములను హేళన మొనర్చి వా?

సుము—దేవా! దాస్య వృత్తిఁ దప్ప యితర నాగరికతయే దెలియని నాపైనేల కోపగించెదరు?

అర్జు—ఆ యర్జునుఁడు నీ కేమపకార మొనర్చె?

సుము—తమకేమపకార మొనర్చెనో?

అర్జు—ఇంతటి వాచాలవు. నీ సేవ మాకనావశ్యకము పొమ్ము. ఇచ్చట నుండకుము.

సుము—మారాజుగారి యాజ్ఞచే వచ్చియున్నాను. వారు వద్దనుట పర్యంతము నే నెట్లుఁ బోదును?

(కూర్చుండును)

అర్జు—(తనలో) ఈ కాంతమార్గ మొకవిధమై యున్నది. నన్నెఱింగి యిట్లు మాట్లాడుచున్నదా! కానిమ్మింకనుఁ జూచెద (ప్రకాశముగ) పొమ్ము పోకున్న శపించెద.

సుము—శాప భయమున్నగదా పోవలయు.

అర్జు—శాపమునకు భయమొందవా?

సుము—బ్రాహ్మణులో, నిక్కపు సన్యాసులో యైన శపింతురను భయము.

అర్జు—(ఆశ్చర్యమున). ఇంకేమను కొన్నావు?

కుము—దాసురాలను కరుణింపవలయు. అర్జున రాజేంద్రులని యనుకొన్నాను.

అర్జు—నీ వెవరో నిక్కముగా చెప్పుము.

కుము—సుభద్రాదేవి పరిచారికను. రుక్మిణీదేవిగారి యానతిచే సుభద్రాదేవికిఁ తెలియకుండా సన్నిధి కరుదెంచి యున్నాను.

అర్జు—వారు నిన్నెందుకుఁ బంపియున్నారు?

కుము—మా సుభద్రాదేవి తమసేవ కరుదెంచుననియు, మిమ్మర్జున రాజేంద్రులని తెలిసి సిగ్గుచే తమసేవ కరుదేరకున్న మీ సేవ చేయుచుండవలెననియు, నంతఃపురంబునందు జరుగు రహస్యములు మీతో విన్నవించుచుండవలెననియు. మీ రెరిగించు సమాచారము తన కెరిగింపవలెననియు, రుక్మిణీ దేవిగారు నన్ను నియమించియున్నారు.

అర్జు—సుభద్ర శృంగారవంతురాలని చెప్పితివే, అంత శృంగారవంతురాలా!

కుముద్వతి (౨౧ అనుబంధము)

ఆ సుదతి కనుగొనల కౌతుకఁ దీర్చి విడెము చేసి ఆ పాంగ వీక్షణంబుల నిరీక్షించి నంత మునులైనను మనసిజ ప్రసూనాస్త్రంబులకు తల్లడిల్లక యుండరు.

(ఇంక జనుదెంచును చూతురు లెండు).

(అంతలో పద మంజీర ధ్వనులు వినుపించును)

కుము—అదిగో దేవా! మా సుభద్ర దేవి జనుదెంచుచున్నది. నేనా లతా భవనంబు చెంత నుండెద.

(కుము—నిష్క్రమించును).

(అర్జునుడు కన్నులు మూసుకొని జపసరముఁ ద్రిప్పుచుండును).
(సుభద్ర పూజా ద్రవ్యంబులు గైకొని ఉత్పలతో ప్రవేశించును).
(ఉత్పల, సుభద్ర యతికి నమస్కరించి నిలుతురు).

అర్జు—(కన్నుదెరచి) నారాయణ నారాయణ కల్యాణమస్తు.

సుభద్ర (౨౨ అనుబంధము).

సుభ—ఈ పూజా ద్రవ్యంబులుఁ గైకొనుడు.

అర్జు—పరమ సాధ్వీ తిలకంబగు నీవు మాకోటి యతిపతి సేవసల్పుట సహజమే గదా. ఆ పీఠముపై నిడుము.

(పుష్ప ఫలాదులు పీఠముపై నుంతురు).

సుభ—దేవా! తమ సేవయొనర్ప మాయన్న గారు నన్ను నియమించి యున్నవారు. ఏలయు పదార్థములు సెలవొసంగు చుండవలయు.

యతి—అదిరయే నాకోరిక వలసినపుడేరింగించెద కూర్చుండుడు

(యతి జపము చేయుచుండును)

సుభ—ఉత్పలా! దేవారాధనకు పుష్పమాలలు సవరించితమా?

ఉత్ప—పారిజాతముల నేరి హారముగా గూర్చి తెత్తము.

సుభ—వీరు జపము జేయుచున్నవారు. మన సంభాషణచే ధ్యానవృత్తి కంతరా యముం దటస్థించును పోదము పద!

(నిష్క్రమింతురు)

(౨౩ అనుబంధము)

అర్జునుడు లేచి!

మ॥ భువనైకాద్భుత మోహినీలతయొ
శ్రీ భూకాంత కీరంబొకో।
నవి హృత్పద్మ సుఖాను మోదమొ
లసత్కామారికో మారిరొ॥
భవనాం దోళిత సాంధ్య దీపమొ
పయః పాథో ధిరాట్కన్యయో।
యువ కాంతామణి శుభ్రభద్ర
యశో విద్యుల్లేఖనా నొప్పెడిన్॥

ఈ సుందరాంగి మనోహర రూపం బెన్న వాతరంబే! వలపులం గులుకు చున్నది. మెరుపుల తులం దూగుచున్నది. కెందమ్ముల నిందించుచున్నది. కుంద

మ్మల మండలించు చున్నది. జక్కవల నెకసక్కెములాడు చున్నది. సింగంబుల భంగించు చున్నది. ఔరా! యీ యొయ్యారిని వియ్యమందిన వాడే పుడమిరేడుల కెకిమీడు జేజేల దొరకుజోడు. తీర్థయాత్రలచే, వ్రతములచే, నుపవాసములచే, తపంబొనర్చుటగా గదా యీ మోహిని దేవతా సాక్షాత్కార సిద్ధి గల్గినది లేకున్న లభ్యమానే.

(నేపథ్యమున నుత్పలాయని ధ్వని)

(అర్జునుఁ డాలకించి) అ కొంత జనుదెంచుచున్నది.)

(కూర్పొని)

(౨౮ అనుబంధము.)

ఉ॥ శంకర నీల కంధర విశాల త్రిలోచన పార్వతీపతే
పంకజ సంభ వేంద్ర హరివందిత శూలకురంగ ధారణా।
పంకజవైరి శేఖర కపాలిశివంకర శారదాభ్రని।
శ్శంక శరీర మార శరసాదర మోహముతోడఁ బ్రోవరా॥
ఉమారమణా, సాంబా, హరోం, హరహర మహాదేవా.

(మౌనమున జపము చేయుచుండును)

(సుభద్రాదులు ప్రవేశము)

సుభ—మహానుభావా!

అర్జు—మహాదేవా!

సుభ—(కదళీ దళంబు బరచి వడ్డించి)

సుగంధి—దివ్యభక్ష్య పాయసంబు దేవ యారగింపుమా।

అర్జు—శ్రావ్య భవ్య సాంద్ర రామచంద్ర యాదరింపుమా।

సుభ—నవ్యగవ్య పక్వభోజనంబుఁ దృప్తిఁ జేయుమా।

అర్జు—రవ్యనేక కోటి తేజ రామ దేవ బ్రోవుమా॥

ప్రగ్వణి॥

సుభ—మారు వడ్డింతునా మానివంశావనా।

అర్జు—శ్రీరమనాయకా సిద్ధిసంసేవితా।

సుభ—నీరముల్ గ్రోలుమా నిత్యసత్య వ్రతా।

అర్జు—నారదేంద్రావనా నౌమి నారాయణా॥

సుభ—యతీంద్రా!

అర్జు—శ్రీరామచంద్రా!

సుభ—ఉత్పలా! ఈ మహాత్ముఁడెంతటి తపోనిష్ఠాగరిష్ఠుఁడే అనవరతమును శ్రీరామస్మరణఁ దప్ప వేరుమాటలుచ్చరింపఁడు.

ఉత్ప—ఔను! సర్వము రామార్పణంబే చేయుచున్నవారు, అటు లేకున్న మోహిని కాంతా సాక్షాత్కార కార్యసాధన మెట్లౌను?

సుభ—పలుమారుఁ బిలిచినను బలుకుటలేదు. మనలఁ జూచుటలేదు. భోజనపానంబుల పైనైనను మనస్సు నిలుపుటలేదు. అచల సమాధియందున్నవారు వారికెరుకఁ బొడముపర్యంతము ఆ సరోవర ప్రాంతమున నుందము పద.

ఉత్ప—మంచిది.

(నిష్క్రమింతురు)

అర్జునుఁడు లేచి—

సీ॥ సంక్రందనుని బొందసరి జెందకను భూమిఁ
దిగినట్టి యలశచీ దేవియొక్కొ।
అలుకచేఁ బలుకక కీయుల క్రమించిన
నలు మొగంబులవేల్పుఁ జెలువయొక్కొ।
వేమారు నామారుతో మారుకొని
మీరి రహిమించు నారతీ రమణియొక్కొ।
వనజాక్షు ఘన వక్షము నుపేక్ష చేసి
చరియించు భార్గవీ తరుణియొక్కొ।

గీ॥ అహహా యీ సతిఁ సృజియించినట్టి బ్రహ్మ
యెంత నేర్చరియో చూడ భ్రాంతిఁ బొడమె।
యంతరంగతి మోహాగ్ని యతిశయించె।
బాల నేలకయుండినఁ దాళఁగలనే॥

ఈ బాలామణి చేలాంచలము వాతచలితంబై సోక దేవేంద్రపదవిగా భా
వించుచుండును.

మత్త॥ కామినీ మణిఁగూడియున్నడు।
కాముకేళినిఁ దేలుదున్।
భామఁగూడకయున్న నేగతిఁ।
భ్రాంతి వీడదు నీమహిన్॥

( నే పద్యమున ఉత్పలాయనుధ్వని ) నాలకించి.

ఆహా! చాంపేయ నాస జనుదెంచుచున్నట్లున్నది. [illegible]వలము మాలిమి
యాట పర్యంతము నిజమెరింగింపఁ గూడదు. కానిమ్ము.

( కూర్చొని చేతులు జోడించుకొని )

మత్త॥ రామ శ్రీరఘురామ దశరథ।
రామ సీతా రాఘవా।
నామనంబున చింతమాన్పి।
యనాగతంబును బ్రోవరా॥

( సుభద్రాదుల ప్రవేశము )

సుభ—(తనలో) యతీంద్రులకు చింతఁ గలుగునంతటి ప్రమేయమేమున్నదో విచా
రించెద. (ప్రకాశముగా) దేవా! తాము చింతా పగనశులై యున్నవారు
కారణంబెయ్యదియో వివరింపవలయు.

అజ్ఞ—అందులకు నీవే కారణము. నాధ్యాన సమయమునఁ బిలుచుచుంటివి అం
దుచే నాత్మారాము సాక్షాత్కారం బింకనుఁ గాలేదని యోచన.

సుభ—అజ్ఞులను. లోకానుభవం బెరుంగ. అపరాధమును క్షమింపవలయు.

అజ్ఞ—పాపము నూతన బాల్యాధిక యౌవ్వనవు. లోకానుభవంబె మెరుంగుదువు.
యింకెరుగ గలవు. అప్పుడప్పుడజ్ఞతచేతనో విధిలేకనో అపరాధమే కల్గు
చుండును. అంగున కానందం పర్బ్రహ్మాతియును పూజాంతంబున నము

స్మరించి యుండుము. తద్దోష పరిహారంబౌను. భయపడకుము. సాయం కాలంబౌచున్నది. నేనాహ్నికంబు దీర్చుకొనవలయు, ఉదయమున నేరండు.

సు—చిత్తము.

(నిష్క్రమింతురు.)
(అవనిక బడును.)

## పంచమాంకము — తృతీయ రంగము.

### ద్వారకాపురము, సభాభవనము.



(బలరామ కృష్ణు లాసీనులై యుందురు.)

కృ—అన్నా! దుర్యోధన మహారాజుగారివద్ద నుంచి పునహ పత్రికయే కరు వయ్యె, కార్తిక శుద్ధ దశమీ గురువారమే గదా లగ్న పత్రికె నిశ్చయము. వారి యత్రద్ధ కేమి కారణము?

బల—పలుమారుఁ బత్రికెలు వ్రాయుచుండవలెనా! అష్టమి వెళ్లుదురు, నవమి జేరుదురు.

కృ—అన్నా! సుభద్రను దుర్యోధన చక్రవర్తి కొసంగుట మన యిరువురకును, రేవతీ దేవిగారికినిఁ దప్ప మరియెవ్వరికి నీ యిష్టమున్నట్టగుపడలేదు.

బల—ఒకరి యిష్టాయిష్టములతో మనకగత్యములేదు. మన చెల్లెలను తగిన చోటు విచారించి యొసంగుట మన భారము గదా?

కృ—

ఉ॥ చిన్న తనంబు నుండి మన చెల్లెలి నర్జును భార్యఁ జేతు మం॥
చెన్నుచుగుండి రెల్లరు లహీన మనంబున నెల్ల వేళనా।
కన్నియ పార్థుపై మమతఁగల్గియె యున్నదటంచుఁ దెల్పెనా।
యన్నల మిన్న రుక్మిణి మహామతి నెంచి యొసంగు

నుగ్రజా॥

ఉ॥ మేనరికంబు ముఖ్యమని మెచ్చియు పార్థున కిచ్చితేని స।
న్మానము నొందదచ్చట, ధనాదులు తక్కువ వైభవంబులే॥
దీనవ ఖండరాజ్ఞిపద మెక్కడ గల్గును, యాజ్ఞసేనికిన్।
తానొక దాసిగావలయు, తప్పదు, నాదగు వాక్యమచ్యుతా

దుర్యోధను డందమా! ధృతరాష్ట్రాగ్రనందనుడు, సార్వభౌమ పదవి నొందియున్నవాడు. మన సుభద్ర నాతని కొసంగితిమేని, కృతాభిషేక పదవి నొందును. సమస్త దేశరాజాంగనా ఫాలస్తలన్యస్త నిస్తుల మృగమదావలగ్న చరణ యుగళియై సుఖంబు గాంచును. ఆడవారి కేమి తెలియును. తాంధర్యమే చూతురు. ఆ బిడ్డ సౌఖ్యములు విచారింపవలదా. సహస్రయుగముల పర్యాంతము యోచించినను పార్థుని కన్నను దుర్యోధనుండే యుక్తముండగు.

కృ—మీ మాట సత్యము దుర్యోధను డుత్తముండే గాదు. పరాక్రమమున భీముండగు. శృంగారమున కాముండగు, బుద్ధిని నిస్సీముండగు ధర్మమున

(అనుచున్నంతలో సేవకుడు ప్రవేశించి).

సే—దేవా! దుర్యోధన చక్రవర్తిగారు వచ్చుచున్నారు.

(కృష్ణ, బలరాములు లేచి యెదురుఁబోయి పిలుచుకొని వచ్చి యుచితాసనంబుపైఁ గూర్చుండ నియమింతురు.)

కృ—రాజేంద్రా! ఇప్పుడే నీవిషయ మనుకొను చుంటిమి.

బల—శతాయుః పురుషః యనుట నీయెడ నేడు ఫలించినది.

దు—నాయదృష్ట మట్టిది.

కృ—(తనలో) మట్టిదే (ప్రకాశముగా) లగ్నము సమీపించుచున్నదింతలో నే

దు—అందు కొక్క కారణముఁగలదు. ధర్మరాజు పౌరవతియను కన్యకను, భీమసేనుఁడు కాళిందియను దానిని, నకులుఁడు రేణుమతియను సతిని, సహదేవుఁడు విజయయను కాంతను, స్వయంవరమునందు దెచ్చియున్నారు. వారందరీ దశమి ముహూర్తమునసే వివాహముఁజేసి కొందురట భీష్మద్రోణాదులా లగ్నములు

నెరవేర్చుకొని యనంతర మందరు గలసి యీ లగ్నమునకు రావలెనని తీర్మా నించుటచే నిప్పటి కీలగ్నము మానిసిక మొనర్పబడినది. మరియొక లగ్నము నిశ్చయించుకొని యోగక్షేమము లెరింగి వచ్చెదనని జనుదెంచితి.

బల—అదేమి! అర్జునుడు తీర్థయాత్రనుండి రాకయే ధర్మరాజాదులకు వివాహములా?

దుర్యో—ఏమో! యెవ్వరికి దెలియును. అర్జునుడు మాత్రము తీర్థయాత్రా దీక్షలోనే ఉలూచియను నాగకన్యకను, చిత్రాంగద యను రాజకన్యకను వివాహమై యుండలేదో; వార్లకేమి?

కృ—సరి! మరియొక లగ్నము నేర్పాటుఁ జేసుకొనవచ్చును. మించిన దేమిగాని, అన్నయ్యా! రైవతకాచలోత్సవమునకే తేరఁ సర్వులకాజ్ఞ నిడుము.

బల—ఈసారి స్త్రీజనములు సహా రైవతకాద్రికి రావలయునా?

కృ—

కం॥ మాటికి మాటికి స్త్రీజను।
లేటికి రైవతక గిరికి రేవతి మొదలౌ।
బోఁటుల నిర్వారిఁ దోడ్కొని।
నేఁటికి నారవ దినంబునే నరుదెంతుర్॥

బల—యతీంద్రులకు సేవ చక్కగా జరుగుచున్నది గదా?

కృ—కొదువ యేమి?

దు—యతీంద్రు లెవరు?

బల—చాతుర్మాస్య నెరవేర్చుకొనుట కొక్క సన్యాసి గోకర్ణంబు నుండి జనుదెంచి యున్నవాడు.

కృ—రాజరాజుగారరుదెంచి యున్నారు. ఈసారి వినోదముగా నందరు రైవతకాద్రి కరుగవలయు.

బల—దుర్యోధనా! వచ్చెదవా రైవతకాద్రికి?

దు—కానీ! యోచించి చెప్పెద.

బల—యోచించుటేమి? పోదము లెమ్ము.

కృ—యుల్లములో లేని యుత్సాహమా వారి యిష్టమెట్లున్నదో?

బల—మన మెల్లరు రైవతకాద్రి కరుగుమండ నిట శానొక్కడుండి చేయవలసిన పని యేమి?

దు—ఎప్పుడు వెళ్లుట?

బల—నేటికి మూడవ దినమున.

దు—వచ్చెదను లెండు.

బల—ప్రాదైనది లెండు.

(అందరు నిష్క్రమింతురు.)

## పంచమాంకము—తురీయరంగము.

ఉద్యానవనము—యతి ఆశ్రమము.

(యతిస్నానమునకు రిగియుండును)

(సుభద్ర-ఉత్పల ప్రవేశము)

సు—ఉత్పలా! ఈ యతీంద్రులు వా రిచ్చటికరిగి యున్నారు?

ఉ—కృష్ణాజినము, దర్భాసనము, మాత్రమిచ్చటనే యున్నది. యోగవాగము, కమండలము, పాదుకలులేవు. స్నానమున కరగి యుండవలయు.

సు—చెలీ! యతులకు తలవెంట్రుకలుండవందురు, వుండెబో సంస్కార హీనం బై జడలుఁగట్టి యుండునందురు. ఈ యతీంద్రున కట్లుఁగాదు ప్రయత్నముగా పెంచుకొని జడలు ముడివడనట్లు కురులు చక్కబరుచు కొనుచుండు లాగు తెలియు చున్నది. శృంగారమునకుఁ దోడు వర్చస్సు దిన దినాభివృద్ధి

గనుచున్నది. ఉపవాస తపాదులచే శుష్కించి యుండలేదు. పూర్ణ యౌవన ప్రాదుర్భావ సమన్వితంబైన పటుత్వ శరీర సంపదచే బాలు పారుచున్నారు. అహా! యేమి ఈ యతీంద్రుని తపో విలాసము.

## సుభద్ర (అగ్ని అనుబంధము.)

మూడు నెలలనుండియు నిట్లే యోచించు చున్నదాన.

ఉ—దేవీ! బాల్యమునందే వైరాగ్యము సంభవించుటచే వట్లగుపడుచున్న వారని నా యభిప్రాయము.

సు—ఏమో కాని! తెలుసుకోనవచ్చును. ఇప్పుడు యతీంద్రులు జనుదెంచుట పర్యంతము వనంబున సంచరించి దేవపూజకు పుష్పములు గైకొని వత్తము పద!

ఉ—పోయివత్తము.

సు—కుముద్వతి కింకను కోపము మానలేదేమో?

ఉ—అబ్బా! దానికి తల మెడమీద నిలువదు. నీవును, నేనును కావలసియున్నామా?

సు—అదిసహా యిప్పు డుండెనేని యెంతో వినోదముగా వన విహారముం జేయుదుముకదా.

ఉ—ఆమె నెవ్వరు పిలచి పీటపైం గూర్చుండ బెట్టువారు? వుండని లెమ్ము.

(నిష్క్రమింతురు)

(అర్జునుఁడు ప్రవేశించి దండమును, కమండలమును, కృష్ణాజినముపై నుంచి నిలువబడి యెవ్వరైనా యున్నారేమో నని నలుప్రక్కలకు జూచి)

అ—ఔరా! యెన్నిదినము లిట్లుమారువేషముచే మెలంగుచుండవలయు? మూడు మాసములయ్యె. సుభద్ర నా చెంతనుండునప్పుడా శృంగారమునే నిరీక్షించుచు మైమరచి యాహారము నాశింపకుండుదు. ఆ సతి గృహంబున కరిగెనేని మగల నెప్పుడు జనుదెంచునోనని త్రోవకదురుఁజూచుచు నాహారము నాసింపకుండుదు. నాకుఁ దృప్తి యేరీతి నగుచున్నదో శ్రీ కృష్ణపరమాత్మకే యెరుక. ఇట్లుండుట మరింత తాపమున కాకరమైయున్నది. యేమి సేయుదు?

సీ॥ ఎరిగింతునా నేను నరుడంచు।
నటుపైనఁ జనుదేరకుండునో సారసాక్షి।
జూపింతునా నైజశోభితాకారంబు।
నిష్టమెట్లున్నదో యెరుఁగరాదు।
బలిమిచే రతిసౌఖ్యభాగ్యంబు గందునా।
కృష్ణుడేమనునో బల్ దుష్టుడనుచు।
అడుగుదునా బలుని పడతి నిమ్మంచును।
కాదన్న క్షాత్రమె గాంచవలయు॥

గీ॥ నేమిసేయుదోప దెట్లుందు నేమందు।
మదనశరము లెపుడు మాటుజెందు।
సమయమెపుడుగందు సన్యాసినైయుందు।
నింక నెన్నిదినములీ శశంభో॥

(కుముద్వతి ప్రవేశించును.)

అ—కుముద్వతీ! పురిలో నేమి విశేషము?

కు—దుర్యోధన చక్రవర్తిగారు వచ్చియున్నారు.

అ—అతని రాకకు కారణమేమి?

కు—కార్తీక శుద్ధ దశమి ముహూర్తము నిలచినదఁట. ఇంద్రప్రస్థము నందు ధర్మరాజాది దేవరవారి సోదరుల కందరికి నిదే ముహూర్తమున వివాహములఁట అందుచే నిచ్చట మరియొక లగ్నము నిశ్చయించుకొని యోగక్షేమము లారసి పోవ జనుదెంచి యున్నవారఁట.

అ—వారెవ్వరెవ్వరు వచ్చి యున్నారు?

కు—వికర్ణుఁడును చక్రవర్తిగారును నిన్న సాయంకాల మేతెంచిరి. నేఁడుదయమున కర్ణుఁడు వచ్చియున్నవాడు.

అ—వారి రహస్యము లేమైనఁ గమనించితివా?

కు—నిన్న రాత్రి విడిదియందు వారిరువురు శయనించి యుండి రహస్యముగా మాటాడుచుండుట నే వింటిని.

సుభద్ర తనపై నిష్టమున్నను, లేకున్నను, బలరామదేవుఁ డిచ్చెదనని చెప్పి యున్నవాఁడగుటచే తనకా కొరంత ఏమియు లేదట. తన వైభవంబంతయుఁ జూపించి యొకచో నీ యుద్యానవనమున నుండి సుభద్ర తమసేవకై జనుదెంచునప్పుడు తన విలాస మగుపరచునట. ఆమెను మెప్పించుటకై యమూల్యంబగు నొక నవరత్న హారము దెచ్చి యున్నాడట. ఆమె సమ్మతింపకున్న పైబడ నుంకించుచున్నాడట. మితిమీరి సేని బలవంతమున నెత్తికొని హస్తినా పురమున కేగునట. తన కిష్టము లేకున్నను బలరామదేవుఁడు రైవతకాచలోత్సవమునకు రమ్మని పిలుచుచున్నాడట, రేపువెడలవలెనట. అందుచే నేఁడేమేమియో చమత్కృతు లొనర్తురు. నేమనుఁగనిపెట్టుకొని యుండెద. తాము మాదేవిపై నొక దృష్టి నుంచి యుండవలయు.

అ—అట్లైన సుభద్రపై నొక దృష్టి యేటికి! సంపూర్ణదృష్టియే నిలిపి యుండెద. నీవు పొమ్ము. (కుముద్వతి నిష్క్రమించును.)

(అంతరావనిక పడును.)

(దుర్యోధనుడు—వికర్ణుడు ప్రవేశింతురు.)

దు— సీ॥ లలితమహా పుష్పపల్లవ ఫలస్తబకమై।
బహువిధతరుల తాభరితమగుచు।
అవిరళ శుకపికా రవదిశాకుహరమై।
యిందిందిరారవానంద మగుచు।
మకరందధారార్ద్రి మధుపప్రకీర్ణమై।
పతిన మధూక పుష్పౌఘయుగుచు।
ఘనసార సాంకవాగరు గంధయుక్తమై।
రామా జన మనోభి రామమగుచు॥

గీ॥ మధురఫల భక్షణా పేక్షి మర్కటేంద్ర।
చలిత శాఖాగ్ర పరిపక్వ ఫలగుళుచ్ఛ।
పతనట పటప నాదశుభ ప్రతాన।
మీవనంబును గనుగొనుమా వికర్ణ॥

ఈ యారామ మింద్రుని నందన వనమో, కుభేరుని చైత్ర రథమో జయం
తుని వైభ్రాజికమో తెలియరాదయ్యె. వసంతమాధవుల కీ యుద్యానమే అనవరత
విహార యోగ్యంబై యున్నట్లు దోచుచున్నది. ఈ మనోజ్ఞా రామ మందాశ్రమము
గల్పించుకొన్న యతీంద్రుని సేవ లొనర్చుటకై సుభద్ర చనుదెంచి యుండును.
లేక చనుదెంచును. ఈ వనంబునందు జాము వారివలె మన మటు యిటు దిరుగు
చుందము. రాత్రి మన మనుకొన్న రీతి సమయస్ఫూర్తి గావింతము.

విక—దేవా! ఆ యతీంద్రుని దర్శనము జేసుకొని వత్తము. సుభద్రాదులందే యున్న
వారో, లేరో, తెలుసుకొన వచ్చును గదా?

గు—వలదు! ఈ యాదవుల కిది యొకవెఱ్ఱి. అనవరత మెవ్వరో ఒక రాతిని పూజిం
చుచుందురు. మన మచ్చటికరిగి యా మౌని యతికి సాష్టాంగ నమస్కారము జేసి
తీరవలయు. మార్గము వంచి మరియొకరికి నమస్కరింప వలెనన్న నామన
సొప్పదు. ప్రత్యక్ష దైవతములైన మా తల్లిదండ్రులకే నమస్కరించుట నా
కమానుషముగా తోచుచుండును. ఉత్తమ వీర క్షత్రియుండ నగుటచే
మ్రొక్కు ధాతువే నా కుపయోగింపదు.

విక—అట్లైన మన మా వైపున సంచరించుచుందము. సుభద్రాదుల రాక నిరీక్షిం
చవచ్చు.

గు—మంచిది.

(నిష్క్రమింతురు.)

(సుభద్ర ఊర్మిళతో ప్రవేశము)

సుభద్ర (౨౬ అనుబంధము).

వృత్తము.

సు— బాల బాల రసాల సాలతమాల తాల విశాలమే।
ఊ— ఏలకీ లతనంటవే బిగువేల నీ మృదు కేలచే।
సు— ఎందుజూచిన కుందములె యేమందునీ వనరమ్యముల్।
ఊ— వందనందన చనము దేవకి నందనాయతి సౌమ్యముల్।
సు— లతల కేమో వెతలు జూడుము గతులు లేకను గ్రాగెనే।

ఉ— లతిక దేహ భవత్తమూ శుభ లతికగని యిటులయ్యెనే।
సు— ఈరములలో దూరి కైతవ మూరుతుండరుదెంచెనే॥
ఉ— ఈరములలో నున్నకైతవ మూరుగని సుఖయింపుమా॥

సు—ఈ విశేషంబు మాడుము, తుమ్మెద గానమే శృతియై, చిలుక పలుకులే తాళ ధ్వనులై, కోకిల కుహూకారములే సంగీతంబై, గొరువంకల కలకలమే మృదంగ నినాదమై, ననరంగ మంటపమున శిలకంఠ వారాంగ, నన్నృత్యము జేయుచున్నది?

ఉత్ప—అమ్మా! యీసంపంగి పుష్పముల నేరుదయు ఎంత మనోభిరామముగా నున్నవి?

సుభ—ఔ; గదవే! పోదము రమ్మా?

(ప్రక్కకు నిష్క్రమింతురు.)

మరియొక ప్రక్కనుండి దుర్యోధన వికర్ణులు ప్రవేశింతురు.

(దుర్యోధనుఁడు ప్రక్కకుఁ జూపుచు).

దు—వికర్ణా! యీ సుభద్ర తనూ విలాసముఁ జూచితివే?

కం॥ కచభార పీడ చేతను।
కుచ యుగము భయంబుఁ జెందె కుచ భారమునన్।
కచము దిగుల్బడి యున్నది।
కచకుచ భారంబుచే జఘన మిటుడస్సెన్॥

చం॥ భువనములన్ జయింపగను పుష్పశరుం డమృతంబుఁ గూర్చి స్వ
ర్గవిని దలంచి సారస పరాగమునన్ శశికాంత చూర్ణమున్।
కవి హృదయాగ్ర రంగమునఁ గల్పి సువర్ణపు పూతఁ బూసియా।

యువిదను సృష్టిఁ జేసెనో కా యూర్వసి రంభల మించు
నట్లుగాఁ ॥

ఇట్టి మోహన విలాసినిఁ జేపట నుంకించుచున్న నేనుఁ గదా జగదేక ధన్యుడను. మనోజ శరాసారంబుల కిక నోర్వ నాతరంబుగాదు. సఖీజన యుక్తయై కుసుమాప చయంబుగావించుచు నా వియోగభారమున కృశించి నన్నెప్పుడు గందునో యని యువ్విళ్లూరుచున్న యీ సుభద్ర చెంతజేరి తదాలింగన మొనర్చి యధరామృత పానానందం బనుభవించెద. నిప్పుడే గాంధర్వ విధిగా కరగ్రహణం బాచరించెద. నీ విందే యుండుము.

విక—దేవా! బలరామదేవు డిచ్చెదనని జెప్పియున్నవాడు. గాని, యీ దేవి చిత్తవృత్తులు మీ రిదివరకు కనుగొని యుండలేదు. త్వరపడితిరేని కార్యమెటు బోయి యెటువచ్చునోయని చింత గల్గుచున్నది. ఇందుపై తమ చిత్తము.

దు—వికర్ణా! పరాక్రమోపజీవులైన క్షత్రియుల కొకరిచ్చుటేమి? గైకొనుటేమి? యీసతి చిత్తవృత్తులే మెరుంగవలయు నేగావలెనన్న వలదను వారెవ్వరు. నేనిక పోయెద. (ననుచున్నంతలో కుముద్వతి యొక జాబు చేత దీసుకొని ప్రవేశించును).

కుము—రాజేంద్రా! వందనములు.

దుర్యో—నీ వెవరు?

కుము—రేవతీ దేవిగారి యంతఃపుర పరిచారికను.

దుర్యో—ఇచ్చటి కేందుకు వచ్చితివి?

కుము—అమ్మగారు తమ కొక్క యాశీర్వచన లేఖఁ బంపి యున్నవారు.

(జాబిచ్చును.)

(దుర్యోధనుడు జాబు విచ్చి చదువును.)

కుమారా; దుర్యోధనా!

నాముఖ్య చెలి యీకుముద్వతి దీని మా
ట వెనుదీయ్యకుదీని బుద్ధిని పూలు

నఁ బూజింపవలయు, నీ ముద్దుగుమ్మ
వలె నెందరో యున్నవారు, నమ్మవద్దు,
నేనట్లున్న, యీచెలి, నీ చెంతఁ జేర్పను,
సుఖముఁగోరి వచ్చితివి, మనసు, భ
ద్రము గాంచుము, త్వరపడకుము, యీచె
లి యుద్యానమందున్న సుభద్రనుఁ గని
నీకుఁ దెల్పు నప్పు డొంటి గాఁ బోను నాకు
మాత్ర మపకీర్తి రానీకు మీవుమ్మాన
భంగం బొందకుము, నీకు వివాహయోగ
మొనకూడినది అందే గాంధర్వం బొన
ర్తువు, మరల నన్నుఁ జూడుము, శ్రేయము.

నా స్వహస్త లిఖితమును శ్రద్ధతో విమర్శింపుము.

నీ శ్రేయోభిలాషి.

రేవతీదేవి.

సు—అట్లైన! నే నిప్పుడేమి చేయవలయు?

కు—మీ రిప్పుడు తొందరపడుచున్నారు. అట్లైన కార్యము చెడును. సుభద్రాదేవి యిప్పుడు సఖీజనులతో నున్నది. మీ చిత్తవృత్తి దేవిగారెరింగి యీజాబు వ్రాసి నన్నుఁ బంపి యున్నవారు. సుభద్రాదేవి గారికి తమపైన చింత కల్గినను ఆమె చెలులు అన్య మార్గావలంబకులై యుండుటచే మీకు ప్రతికూలులై సవారలతోఁ బోయి చెప్పుదురు. అందుచే కయ్యమునకు కారణమౌను. మీరించుకైనా విశ్రమింపుడు. వనవిహారముచే చాలా బడలి యున్నట్లు మీ ముఖమున బొడమిన స్వేద బిందువులే చెప్పుచున్నవి. నేను సుభద్రాదేవి చెంతకు బోయి లోకాభిరాముడుగా మీరిచ్చటి కరుదెంచిన సంగతిఁ దెలియజేసెద. సమయము వేచి సఖీజనుల నేదో యొక నెపముచే నావలికి బిలుచుకొని వచ్చి

మీకెరింగించెద నావల గాంధర్వమో, రాక్షసమో, పైశాచమో మీకేది యిష్టమో యట్లొనర్ప వచ్చును.

దు—మంచిది! నీవు వచ్చువంత వరకు నే మెందుండ వలయునో యెరింగింపుము, స్నాన మొనర్ప వలయు. వన విహారముచే నాయాసము గలిగియున్నది. యిం కెందైనా జలాశయంబు గలదా?

కుము—ఈ యుద్యానమున రెండు సరోవరములు గలవు. అమృత సరోవర మొకటి సౌభద్ర తీర్థము మరియొకటి. కాని, అమృత సరోవరము పశ్చిమ దిశయం దిచ్చటికి కొంత దూరమున గలదు. అదే తూర్పు దిశయం దతి సమీపము నందు గాన్పించు లతా భవనంబు చెంతనే సౌభద్ర తీర్థము కలదు. మా సుభద్రాదేవి సంచరించునది. ఈ సమీపముననే మీకేది యిష్టమో అందు లో స్నాన మొనర్చి యీ లతా భవనంబునందుండుడు జలక్రీడా సక్తి గల్పించి యీ సరోవర ప్రాంత్యమున కామెను గోడ్కొని వచ్చెద. అవల (చిఱునవ్వు నవ్వి) మీయిష్టము.

దుర్యో—సుభద్ర నాపై మమత గలిగియున్నదని నీ కెట్లు తెలియును?

కుము—తాను సార్వభౌమాభిషేకపదవి నొందవలయునని యెల్లప్పుడు తన ప్రేమాప్తులతో చెప్పుచుండును. ఇప్పుడు దేవరవారి కొసంగెదనని బలరామదేవుడు నిశ్చయించి నప్పటినుంచి యామె తొందర యింతయని జెప్పవలవి కాదు. తమ చెంత కెవ్వరెరుంగకుండా నాచే సందేశ మంపించవలెనని యోచించి కృష్ణభీతిచే నూరకున్నది. మీపైననే చింతగలిగియున్నది. కాని యిక నాకు శలవొసంగిన నేఁజని తమ పనియంతయుఁ దీర్చెద.

దుర్యో—నీ పేరేమి?

కుము—కుముద్వతి యందురు.

దుర్యో—మంచిది! నీవొనర్చిన యుపకృతికి పారితోషంబొసంగెదను లెమ్ము?

కుము—తమ కోర్కెయే నెరవేరనేని నాకేమి కొరత గలదు?

దుర్యో—నేని సౌభద్ర తీర్థముననే స్నానంబొనర్చి యాతీరంబునందే లతా గృహంబునందుండెద. నాకా సుభద్రా నామమే భద్రధామము. ఆ తీర్థమే పరమ పవిత్రము. యిక నీవు పొమ్ము.

కుము—చిత్తము. (నిష్క్రమించుదురు).

దుర్యో—వికర్ణా! ఆ మహా తల్లికి చిన్ననాటి పుత్రవాత్సల్యతి యిప్పటికిని విడువలేదు కదా?

విక—దేవా! యెవ్వరా రేవతీ దేవిగారు?

దు—బలరామదేవుని భార్యగదా?

విక—పుత్ర వాత్సల్యత యెట్లు?

దు—నేను బలరామదేవుని యొద్దగదా యుద్ధము నేర్చుకొను నప్పుడు నన్ను తల్లివలె రక్షించినది.

విక—ఆ జాబామెయే వ్రాసియుండునా?

దుర్యో—యౌవనమేమి అటులేకున్న "కుమారా దుర్యోధనా" యని సంబోధించినది. అనంతరము జాబు వ్రాసినది. ఆమెగాక నన్నేకవచనమున బిలుచువారెవ్వరు. యాదవ వృద్ధులైన దేవకీ వసుదేవోగ్రసేనాదులు సహా బహువచనముననే వ్యవహరింతురు.

విక—ఇంక సరోవరముచెంత కరుగుదము.

దుర్యో—మంచిది.

(నిష్క్రమింతురు.)

(వేరొక ప్రక్కన సుభద్ర, ఉత్పల ప్రవేశము).

ఉత్ప—దేవీ! నృత్యము.

నీ యధరంబునఁ బోలెడి చిగురులు, నీరజలోచన గైకొనుమా।
పాయక నీకచవైరము గవిలిన, బంభరముల్ గను పద్మరమా।
శ్రీయుత మీతను చెల్మిని వెలసిన, చిత్రసుమంబులు జూడుమమా।
హాయి యొసంగెను ప్రాణములకు నిదె యబ్జమరంద మహాగనుమా॥

(కుముద్వతి ప్రవేశము).

సుభ—అహా! కుముద్వతీ, కుముద్వతీ నేటికి దయగల్గెగదా?

కుము—దయాంతఃకరణ లటుండ నిమ్ము. నేడొక చిత్రము జరుగుచు గాంచుచుందము రండు రండు.

సుభ—ఏమి చిత్రమే?

కుము—అంతయు నెరిగించెద. నా సరోవర ప్రాంత్య లతా భవనంబు చెంత కరుగుదము.

(సుభద్రను చేయి పట్టి లాగుకొని అందరు నిష్క్రమింతురు)

(సరోవరము).

(దుర్యోధన వికర్ణులు ప్రవేశము).

దుర్యో—

ఉ॥ చారుఝషాక్షి కంబుగళ, చక్రపయోధరి, బంభరాలకాం,|
భోరుహ పాణి, సైకతవి, భూషితశ్రోణి, మరాళయాన,రం|
భోరువు, ఫేనహాస, పర, మోత్తమ కచ్ఛప పాదయైన శా|
సారము(జూడ(జూడ నొక, సారస నేత్రిగ(దోచె మిత్రమా॥

విక—చూచుట కత్యంత రమణీయంబై గన్పట్టుచున్నది. కాని, యింతెవ్వరు స్నానాదు లొనర్చినట్టు కానరాదు. ఇప్పుడు స్నాన మొనర్పకున్న నేమి?

దుర్యో—అయ్యో! యేమిటి కట్లనియెదవు. ఈ నీరమమృతోపమానంబై పరిశుభ్రంబైయున్నదే. వన విహారాయాసముచే దేహము ఘర్మజలసిక్తంబై యున్నది. నే స్నానం బొనరింపనే వలయు.

విక—చిత్తము.

(దుర్యోధనుడు కవచాదులుఁ దీసి సరోవరములో నీళ్లకు దిగును).

(సుభద్రాదులు రహస్యముగాఁ జనుదెంచి లతాభవనంబున నుండి చూచుచుందురు).

(స్నానము నొనర్చుటకై దుర్యోధనుడు నీటిలో దిగును. ఒక మొసలి వచ్చి పాదముఁ బట్టుకొనును).

దుర్యో—హా! యేమిది?

విక—అయ్యో! మొసలి, మొసలి, దేవా; దుర్యోధనా!

దు—భయపడకుము. (అని మరియొక కాలితో మొసలిని దన్నును. మొసలి పట్టు విడక నీటిలో గీడ్చుచుండును).

దు—వికర్ణా! ఆ ఖడ్గం ఇవ్వుము ద్రుంచి వైచెద.

(వికర్ణుడు ఖడ్గమిచ్చును. దుర్యోధనుడు మొసలిని ఖడ్గముచే మొత్తును. మొసలి వీపునకుఁ దగిలి ఖడ్గము విరుగును).

విక—దేవా! ఇంకే మొనర్పవలయు?

దు—(నడుమున నున్న చూరచే బొడచును. అదియు విరుగును).

విక—దేవా! శంఖమును బూరింపుము. మాయన్న చనుదెంచును.

దు—ఇపుడు వలదు.

విక—అయ్యో! యింకేమిగతి దైవమా యెవ్వరును రక్షింపువారు లేరే!

(అని గట్టిగా అరచును).

(యతీంద్రుడట శీఘ్రమున బ్రవేశించి).

య—ఎవ్వరు! భయపడవలదు, ఏమి?

విక—మా దుర్యోధన చక్రవర్తి గారిని మొసలి మ్రింగుచున్నది.

య—(జానుదఘ్నముగా నీటియందుఁ బ్రవేశించి వామ పాదముచే మొసలిని తన్నును, మొసలి పట్టు విడచును).

(దుర్యోధను డాయాసమున పాదము బైటదీసి తలవంచి రక్తముఁ దుడుచుకొను చుండును).

(యతి యెడమచేతితో మకరినిఁ దీసి బైట విసరును)

(దుర్యోధనుడు లేచి కవచాదులు ధరించి)

దు—యతీంద్రా! మీరరుదెంచుటచే నేను మగల జన్మించి నట్లైతి.

య—రాజేంద్రా! యతులును, రాజులును, సహోదర న్యాయమున వర్తింపవలయు నందున నీవు సహోదర ప్రాయుండవగుటచే నిది యొక సహాయమా! చింతిల్లకుము. గృహంబున కరిగి విశ్రాంతిఁ గైకొనుము.

(యతి నిష్క్రమించును).

విక—దేవా! ఈ సరోవరమున స్నానం బొనర్పకూడదని నే విన్నవింపలేదా.

దు—ఆ దురాత్మురాలు మోసగించినది.

విక—ఆ జాబు నా చేతి కివ్వుడు.

దు—(జాబిచ్చును).

విక—(చూచి, చదివి) పదుమూడు పంక్తులు. పంక్తికి పదుమూడక్షరములు. వ్రాయుటకేమి కారణము? ఇందేదో సంకేతముండవలయు.

దు—ఏముండవలయు? ఆ ముండ మాయదారితనమే యిది.

విక—"నా స్వహస్త లిఖితమును శ్రద్ధతో విమర్శింపవలయునట" యేమి వివరింపవలయు? (విమర్శించి) రాజేంద్రా చూడుము దానిచమత్కారము. ఆద్యక్షరములు. అంత్యాక్షరములు గలిపి చదివెద వినుడు.

దు—ఏమున్నది?

విక—తాము నను జూడుడు. "నామాటలు నమ్మవద్దు. నేను సుభద్రచెలిని నీకు మానభంగ మొనర్తును".

దు—ఓసీ, దురాత్మురాలా! యింకెందైనా యున్నదేమో చూడుము. ఖండించెద.

విక—పోనీ; లెండు! స్త్రీవధ పంచ మహాపాతకములలో నొకటి గదా?

దు—నీవేమి! ధర్మరాజు తమ్ముడవా?

విక—చిత్తము.

దు—వెదకుదము. దొరికిన (మీసములు దీడుచు నిష్క్రమించును).

(సుభద్రాదులు ప్రవేశము).

సు—(నవ్వుచు) ఎంతిపని యొనర్చితివే, కుముద్వతీ?

కు—ఇతఁడు నీవు మెచ్చునట్లెనని, శృంగారముఁ జేసుకొనివచ్చి శీవిగా నున్నాడు. నిన్ను బలవంతముగా నెత్తుకొనిపోవ ప్రయత్నించి యున్నాడు. చేయవలెనో అవశ్యకము లేదో.

సు—యతీంద్రుడు రాకుండిన నీతనిపని వ్యర్థమగునే?

కు—యతీంద్రుడు సమీపమునందున్నాడనియే నేనీ యుక్తి బన్నినది.

సు—ఇంక మనమిచ్చట నుండరాదు. ఆదురాత్ముని కారిబడితిమేని మన కపాయము సంభవించును.

కు—ఏమిటికైనను ఆ యతియే యున్నాడు.

సు—కుముద్వతీ! యీ యతీంద్రున కెంతటి భుజశక్తి గలదు. ఏటియందున్న మొసలిని బట్టి యొడమచేతితో గట్టి కీడ్చివైచెనే!

కు—దేవీ! ఆ యతీంద్రుని ప్రభావమింతింతయని చెప్పుటకు సాధ్యము కానిపని. యమ్మహాత్ముని చెంతనుంటిమేని దేవేంద్రాదులైనను మనలకెదిరి జూడజాలరు. ఈ కౌరవ రాజునకు మనము భయపడవలెనా?

సు—ఇంతటి భుజబల మీతని కెందుండి వచ్చెనో?

కు—తపోబలము, బ్రహ్మబలము, క్షత్రియబలము, స్వబలము, భగవత్సహాయబలము. గలిగి మహా బలవంతులై యున్నవారు.

సు—మనమింక యతీంద్రుని చెంత కరుగుదము రండు.

(నిష్క్రమింతురు).

(దుర్యోధన వికర్ణులు ప్రవేశము).

దు—ఎందెందు వెదకినను కానరారైరి, యెటబోయి యున్నవారు?

విక—ఎచ్చటికరిగిన నేమి. ఈ జాబును యిప్పటి మోసమును జూడగా సుభద్రకు తనపైన భ్రాంతి లేనట్టు, స్పష్టమగుచున్నది.

దు—సరి! సరి! ఆ కాంత భ్రాంతి కల్గిన నేమి. లేకున్న నేమి. బలభద్రుడొసంగ నిశ్చయించి యున్నాడు. నాకాచింతయే లేదు.

వీర—ఆ దురాత్మురాలి నిప్పుడే శాసింపవలెనా? మరియొకతూరి శాసింపగూడదా?

దు—ఇప్పుడే చంపవలయు, నీమాటలు నే వినను.

వీర—అప్పుడును నామాట వినరైతిరి (తనలో) రోగికి పథ్యము రుచించునా?

దు—ఇంకను వెదుకవలయు, పద.

(నిష్క్రమింతురు).

(సుభద్రాదులు పరువెత్తుచు వచ్చి రంగమున నిష్క్రమింతురు)

(మరియొకప్రక్కన దుర్యోధనాదులు పరువెత్తుచు వచ్చి పోవుచున్న కుముద్వతిని బట్టుకొని).

దు—దురాత్మురాలా! మాయలాడీ చావుము (ఖడ్గమెత్తును).

కు—అయ్యో! చచ్చితి, రక్షింపుము, రక్షింపుము, యతీంద్రా; త్వరగా రక్షింపుము?

(యతి యోగవాగమును ధరించి ఆతురమున ప్రవేశించి)

ఛీ; దుర్మార్గా! (అనియోగవాగముచే పొడచి దుర్యోధనుని ద్రెళ్లవేయును).

వీర—రాజేంద్రా! యిప్పుడైనా శంఖమును బూరింపుము. మాయన్నజను రెంచును.

దు—(పడి, లేచి) వలదు (అని సైగజేయును).

యతి—రాజా! స్త్రీవధ మహాపాతకము గాదా? శుక్రనీతియు మనుస్మృతియు చదివియున్నావే? ఈ దాసిని సమ్మారించుటకు నీకేమపకారము చేసియున్నది?

(దుర్యోధను డేమియు బల్కక నూరకుండును).

యతి—చాలు; చాలు! క్షత్రియ వంశంబునకు కీర్తి దెచ్చితివి పొమ్ము. యతులున్న చోట నుండుట కర్హుడవుగావు. పొమ్ము. పోకున్న శపించెద.

(దుర్యోధనుడు నిష్క్రమించును).

కు—దేవా! మీరరుదెంచుటచే నేని రాజేంద్రునిచే జావక బ్రతికితిని?

యతి—నీవెందు కీతనిచే జిక్కితివి?

కు—ఈ రాజు మా సుభద్రపై మోహించి తన వైభవము జూపుటకై వచ్చియున్నాడు.

య—వచ్చిన నీకేమి?

కు—సమయము వేచియుండి సుభద్ర వంటరియై యున్నప్పుడు బలిమిచే పైబడి విశేష కౌర్యములాచరింప బ్రయత్నించుచుండె. మా సుభద్రాదేవిగారి మాన రక్షణమొనర్చుటకును అతని నాగమకము నుండి తప్పించుటకును నే నొక యుక్తిచే జాబుఁ గల్పించి యతని కొసంగితి.

య—ఏమి జాబు?

(వికర్ణుడు పారవైచియున్న జాబిదివరకే కంచుకములో దాచియుండి తీసి యొసంగును).

య—(జాబును జూచి) ఎంత ప్రౌఢురాలవే; కుముద్వతీ!

కు—అర్జున రాజేంద్రుల నిటువంటి మాయాలేఖచే ఏ రాజు మోసగించి యుండెనని శ్రీకృష్ణదేవుడు తెల్పుచుండ నేవింటి.

య—అందుకు నీ వీ జాబుఁ గల్పించితివో?

కు—(తల వంచును)

య—ఇక నిర్భయముగా నుండుడు. (నిష్క్రమించును).

సు—కుముద్వతీ! ఎచ్చట అర్జునభూపాలుని మోసగించుట? వారు సుఖముగా నున్నారా?

కు—అర్జున రాజేంద్రుని సంహారింపవలెనని, యీ దుర్యోధను డెన్నియో మాయలొనర్చెనట. ఆ కిథనంతియు సావకాశముగా వివరించెద. అమ్మహాత్ముడిప్పుడు క్షేమముగా నున్నవాడట. కాని, సంవత్సరమునుండియు తీర్థయాత్రావ్రత దీక్షచే గుర్తు పట్టుటకే వీలు లేనటి స్థితిలో నున్నారట.

సు—అయ్యో! తీర్థయాత్రచే నెంత బడలియున్నవారో. గుర్తు పట్టనంతటి రీతి యేమి వేర్పడి యుండునో!

కు—తలవెంట్రుకలు పెరిగియున్నవట. జడలు కట్టకుండునట్లు అప్పుడప్పుడు సంస్కారము చేయుచున్నారట. విభూతి రుద్రాక్ష ధారణులై యున్నారట. తైర్థిక సంబంధమైన వస్త్రములు ధరించినారట.

సు—చెలులారా! మీరేమనుకొనకుడు. నా కొక్క సందేహము కల్గుచున్నది. వినుపించెద, అందుకు మీరేమి చెప్పుదురో?

కు—అమ్మా! మాకన్న నీ కెవ్వరాప్తులు? నీ మనస్సందేహ మంతయు వివరింపవలె నని కోరుచున్నాము.

సు—ఈ యతీంద్రునిపై నాకు సందేహము గల్గుచున్నది.

సీ॥ సముదారశారద శర్వరీహితుఁబోలునీ
మహామహునిని మోమ్ముఁజూడ।
రమణీయ్య రోలంబ రాజియోయనఁ
దగు కేశ పాశంబులో కృష్ణవేణి।
కమనీయ్య చాంపేయ కాంతిచ్ఛదంబుగాఁ
గ్రాలుచున్నది నాసికంబుఁ గంటె।
మహనీయ్య శంఖాయ మానంబుగాతోచె
కంధరం బత్యంత సుందరంబు॥

గీ॥ మాననీయంబు శాంతంబు మానసంబు।
శ్రీకరంబు గభీరంబు చిత్తగరిమ।
భాసురంబణి దీర్ఘంబు బాహుకలిమి।
కానరాజాంశ భవుఁడుగాఁ గానుపించే॥

శంతను జయంత వసంతుల కన్నను మిన్నయగు నీ సుకుమారుండెవ్వరో తెలియదాయె. యతులకీ విలాసంబు గలదా. భీషణ గ్రాహములఁబట్టి బైటికీడ్చు నంతటి శక్తియుండునా. మూర్ధాభిషిక్తుఁడైన వదలించు నంతటి భుజబలము గలదా.

కు—అదేమి! యతులలో పలువిధములు గలరు. వృద్ధశ్రావక సన్యాసులనియు, చక్రధర సన్యాసులనియు, రక్తవస్త్ర సన్యాసులనియు, ఏకదండ సన్యాసులనియు, త్రిదండ సన్యాసులనియు, దిగంబర సన్యాసులనియు గలరు. రక్తవస్త్ర త్రిదండ సన్యాసములలో ననేక భేదములున్నవి. క్రమమనియు, ఆతురమనియు, కర్మమనియు, మోక్షమనియు గలవు. వీట్ల విధులు వేరు. యిమ్మహాత్ముడు నిక్కపు యతీంద్రుడేకాని వేరు కాదు.

ఈ—ఇంకొకటి మరచితివి గదనే?

సు—ఏమి మరచితి?

ఉ—జ్ఞాపకమునకు దెచ్చుకో! కపటసన్యాసి యనుమాట.

సు—మరల నీ యొకతాళికి మొదలయ్యెనే.!

సు—ఉత్పలా? దానిని గేలిసేయకుము, మరల కోపగించుకొనును.

ఉ—అమ్మా! తనవిద్యనంతయు జెప్పక. యింకను కొంచము దాచినది.

సు—(నవ్వి) ఏమిదాచినదే?

ఉ—కపట సన్యాసమనియు, గోముఖవ్యాఘ్రము సన్యాసమనియు, మధులేపిత మండలాగ్ర సన్యాసమనియు, భస్మావృతాంగార సన్యాసమనియు, చెప్పుట విడచినది.

సు—ఏమి! యీ పేరుల కంతమే లేదో.

ఉ—మరి మన సముద్వృతి మాటలు యోచింప మనతరగములో ముగియునట్టు లేదు.

సు—ఏమి వగలాడివే, జారేదవు.!

సు—మీ కలహమునిక చాలింపుడు. నాకేమో సందేహ మంతకంతకు మితి మీరుచున్నది.

## ౨౬ (అనుబంధము.)

ఉత్ప—దేవీ నీకు మోహము సహా మితి మీరుచున్నట్టే యున్నది. ఈ యతీంద్రుని జూచి తీర్థయాత్రా దీక్షితుడై యున్న అర్జున భూపాలుడేమో యను కొంటివో?

సుభ—అదిగో! నేచెప్ప లేదా, నీ వధిక ప్రసంగివి.

ఉత్ప—ఔనమ్మా! యతికి సేవ లొనర్పవలెనని శ్రీకృష్ణమూర్తిగారు నియమించి యున్నారు. అట్లొనర్పక యితడు రాజలక్షణ సమన్వితుడనియు, చిరుత ప్రాయము వాడనియు, నాకేమో సందేహ మనియు, కలితుడనియు, జయంతుడనియు, వసంతుడనియు, ఎన్నియో, యీ మాటలే ప్రసంగము లమ్మా. మిత ప్రసంగము లేనో.

కుము—(నవ్వి) జిత్తులమారి వే నీవు!

ఉత్ప—నేను జిత్తులమారని, నీవు మహామ్మారివి. (అని పక పక నవ్వును).

సుభ—నీ వన్నట్టు యోచింపగా అర్జున భూపాలుడేమోనని తోచుచున్నది. మీ రెన్ని హాస్యోక్తులాడినను నా సంశయము మానదు.

ఉత్ప—అట్లైన, గృహమునకు వెళ్లుదమా?

సుభ—అదేల?

ఉత్ప—సన్యాసిని అర్జున రాజేంద్రుడని నిశ్చయించితివి. నేవ కరిగి "ప్రాణేశ్వరా" యని కౌగలించుకొన్న నేనేమి యొనర్తును? నీకు సందేహ మోహములు విరబీగుచున్నవి.

కుము—చాలు లేవే! యెగతాళి చేయకుము.

సుభ—ఎప్పుడు హాస్యమేనా; యతి సేవ లొనర్ప వెళ్లుదము రండు.

(అందరు నిష్క్రమింతురు)

(వెనుక అవనిక యెత్తబడును)

(యతి దర్భాసనముపై నిలచి)

మ॥ ఎన్నడీ మృగరాజ మధ్యమ నేలి సౌఖ్యముఁ గూర్తునో।
యెన్నడీ యతి రూపు బాసి మహీశుడై పురిఁ గాంతునో।
కన్నవారల కన్న నెక్కువగా ననుఁ దయఁజూడు మో।
పన్నగాధిప తల్ప మాధవ పాహి పాహి దయానిధే॥

మానవతీమణీ! సుభద్రా; యేమి నీ ప్రతాపము? శరచ్చంద్ర చంద్రికా ధవళ సౌధంబులందు వసియించు నన్ను వనసీమలందు కాపురం బొనరింపించితివి. పట్టు మాంజిష్ఠంబులు ధరించుచుండు నాచే కాషాయ వస్త్రంబులు గట్టించితివి. దివ్య పరిమళ మిళితంబగు మృగనాభిచే విలసిల్లు మోమున విభూతి పూత బూయించితివి.

రత్న వజ్రమణిస్థకిత స్వర్ణమయతార హారంబులు ధరించు యురమున రుద్రాక్షమా
లలు వేయించితివి. వైరిదారా గర్భనిర్భేద భయంకర శరశరాసనంబులఁ ధరిం
చు కరముల దండ కమండలములు బట్టించితివి. ఇంకనైనను నీ యాలింగన సౌ
ఖ్యం బొసంగి నా తాపంబుపశమింప రాదా. అక్కటా! నీ వే మొనర్తువు నిన్నెందు
కనపలె. నన్నిరింగించిపోయున్న నీ వప్పుడే మనసిచ్చుచుంటివి. నా కోర్కెలు నెరవే
ర్చుచుంటివి. నాలుగు మాసములయ్యె. శ్రీకృష్ణమూర్తి దయ యింకెన్నడు గల్గునో
తెలియదయ్యె. నీ యజ్ఞాతివాసం బింకెన్ని దినము లనుభవింపవలెనో. ఈ విరాళి
భరింపజాలకున్నవాడ. కానిమ్ము. యెవ్వరేమనుకొన్న నేమి. నేడు సాహసంబొన
ర్చెద. నన్నెరింగించెద. గాంధర్వ విధికరగ్రహణం బాచరించెద. నా కెవ్వరడ్డపడు
దెంతురో చూచెద.

మత్తే॥ బలువుఁడో కాలుఁడో చండభానుఁడో।
మహాపద్మాసనాసీనుఁడో
బలభిద్వాయుకృపీటసంభవులో।
యీ పద్మాక్షినిఁ గోరవో।
జ్వాలు భార్యామణి చేయబూనిన నిదే।
బంధించెదఁ ద్రుంచెదన్।
జ్వలనాకుంఠిత మార్గణావళుల।
జాజ్వల్యోద్ధత బాహాసిచేఁ॥ (యోజించి)

కానిమ్ము; చూతము! (స్త్రీల కలకలము వినుపించును) అదే సుభద్ర వచ్చు
చున్నట్టున్నది. (కూర్చొనును.)

(సుభద్రాదులు ప్రవేశింతురు.)

సు—

క॥ ఫలములో సుమములో మధువో।
జలజమృణాళములో కుశయో జలమో యెవి కా।

వలె దేవతార్చనమునకు।
సెలవొసగిన నిచ్చెదాన శ్రీయతివర్యా॥

య—అవి యన్నియు కావలెననియే యెదురు జూచుచున్న వాడ.

(అని కుముద్వతిని గాంచి సంజ్ఞ యొనర్చును).
(కుముద్వతి చేయి జూచుకొని)

కు—ఉత్పలా! నా స్ఫటిక వజ్రాంగుళీ యమెచ్చటనో పడిపోయి యున్నది గదవే.

ఉ—మొన్న మీ యన్న హరసాంబుడిచ్చిన దేమే?

కు—ఔను!

ఉ—అయ్యో! యెంతబాగుండెనే. పాపాత్మురాలా, యెచ్చట పోగొట్టుకొంటివే?

కు—మన మీదిళ కీదినము పోయి వుండలేదే! అచ్చట పడిపోయి యుండవచ్చు. వెదకి తెచ్చెదము పద.

సు—అయ్యో! వెదకి తీసుకొని రాండు, పోండు.

కు—పదవే యుత్పలా!

(అని నిష్క్రమింతురు.)

య—సుభద్రా! యిదేమి వెంట్రుకలన్నియు చెదర యున్నవి (అని తలదీడి) హారములన్నియు చిక్కుబడియున్నవే (అని వక్షముపైనున్న హారములు సవరించి) రమణీ రాజశుకము నీ చేయిఁ బట్టినది. రాజహంసము నీ కాలుఁద్రొక్కినది చూచితివా?

సు—అట్లగుట మంచిది కాదా?

య—అడుగవలెనా! మంచి శుభశకునములు గదా.

సు—దేవా! నమస్కరించి వేడుదానను. అందుచే నేమి ఫలము?

య—సాయంతిటివాడు నీకు మగడగును. త్వరలో వివాహ మగునట్లు సూచించుచున్నది.

సు—(సిగ్గున చిరునవ్వుచే తనలో) నే నొనర్చిన సపర్యలకు సంతసించి ఆశీర్వచనమిచ్చినారు కాబోలుః (ప్రకాశముగా) దేవా! తమతో కొన్ని సంగతులను గవలెనని కోరిక.

య—కాంతా! నీ వేసంగతి యెఱుగవో. నీ కేసంగతి యనుభవము లేదో అన్నియు నడుగుము, తెలియజేసెద. నేర్పించెద. నీ కన్న నాకెవ్వరు ముఖ్యులు.

సు—మీ రేయే దేశములుఁ జూచినారు?

య—సేతు సీతాచలమధ్య పుణ్యక్షేత్ర పురీవతంసంబు లన్నియుఁ జూచినాడ.

సు—ఇంద్రప్రస్థ పట్టణముఁ జూచినారా?

య—చూచినాను, యేల?

సు—పాండవుల నెఱుగుదురా?

య—వారిలో ధర్మజ, భీమ, నకుల సహదేవులను మాత్ర మెఱుంగుదును.

సు—ఆదేల! అర్జునభూపాలు నెఱుంగరా?

య—చూచి యుందును, జ్ఞాపకము లేదు. అతని లక్షణము లెరిగింపుము గమనించెద

ఉ॥ చేమని చాయవాడు శరచాప కిణాంక కరాగ్రభాగుడుఁ।
భీమ పరాక్ర మోదితుడు వెన్ను నలాంఛన మొప్పువాడు శ్రీ।
కాముని బోలు సుందరుడు కాంచన నీలమణీద్ధభూషుడుఁ।
సోమ మహాన్వయుండతనిఁ జూచితి నే సుహాసియ్య దెల్పుమా॥

య—ఓహో! అతడు తీర్థయాత్రకై వెడలి యున్నాడు గదా.

సు—ఔను.

య—ఆ యర్జునుడును మేమును గదా గోకర్ణమందుండినది. అదేమి పాండవులందరి లో నర్జునుని మాత్ర మడుగుట?

సు—మా మేనత్త కొమారుడైనందున నడిగితిని.

య—తిక్కినవారు మేనత్త కొమారులు గారో?

సు—గోకర్ణమునుండి వారెచ్చటికి వెడలిరి?

య—

॥ మత్తకోకిల. ॥

మానినీ పలుమారు పాండవమధ్యముని కథ నెన్న గా।
మానసంబున దోచె దాయను మాకు దెల్పుము మున్నుగా॥

సు—

వానిని నాయక పాండవేయుడు మానకిటకే తేరునా।
బూని పూర్ణదయా మయంబగు బుద్ధిమాపై నిల్పునా॥

య— ॥ ధృవకోకిల. ॥

అతివ యాతని ప్రైన నీకతి యాసగల్గిన యట్లుగా।
మతికి దోచెను నిక్కమో యను మానమో వివరింపుమా॥

సుభ—

హితము మీర గవ శ్రుతంబిట కెంతదూరము దెల్పుడీ।
యతివరేణ్య మహా ముదంబున నాలకించెద జూడుడీ॥

॥ మత్తకోకిల. ॥

తీర్థయాత్రా పరత నాతని దేహ మెంత కృశించెనో।
పార్థివుల్ మున్నిటులనేనని భావమందప దలంచెనో।

య—

సార్థకంబుగ తీర్థయాత్రలు సల్పి దేహారోగ్యుడై।
పార్థుడీ దిశ నున్నవాడని పల్కెదర్ సౌఖ్యాన్వితుడై॥

యతి—దేహారోగ్యవంతుడై సుఖముగా నిచ్చటి కరుదెంచినాడన్న నీ వేమి తొట్రిల్లుదువోనని యోచించుచున్నవాడ.

సుభ—ఇక్కడికి, ద్వారకా పురమునకా?

సుభ—ద్వారకా పురోద్యాన వనమునకు.

యతి—ఉద్యానవనమున నేమి జేయుచున్న వారు?

యతి—తీర్థయాత్రా దీక్షితులకు వనములలోనే గదా యునికి.

సుభ—ఎవ్వరికిని దెలియక రహస్యముగా నుండుట కేమి కారణము?

యతి—రహస్యమేమి! యతి వేషము ధరించుకొని యెదుటనే యున్నవాడు.

సుభ—య—తి—వే—ష—ము న—యె—దు—ట—నే (చూచుచు తిచ్చగొని నిలచును).

యతి—ఈ కీలక మింకను నీ వెనుకనో?

కం॥ నీ కొఱకై తపియించితి।
నీ కొఱకై తపముఁజేసి నినుఁ గనుఁగొంటిన్।
శ్రీకర లగ్నంబిదెగను।
నీ కోరినవాఁడ తరుణి నేనర్జునుఁడన్॥

(అని లేచి నిలబడును) (సుభద్ర ఆశ్చర్యమును సిగ్గును బెనుగొన లేచి పోబోవును)
(అర్జునుఁడు మార్గమున కడ్డమువచ్చి)

(౨౭ అనుబంధము.)

కం॥ బాలామణి నీకొఱకై।
చాలాకాలంబు నుండి సల్పిన వ్రతమున్॥
నీలోనఁ జేర్చియుండఁగ।
నీలీలన్ బాసిపోవ హితమతి యగునే॥

తరుణీ నీపై మోహాతిరేకంబున ప్రపంచ భ్రాంతి వీడితి. దేహాభిమానం బుపేక్షించితి. క్షుత్పిపాసలు మఱచితి. దివా రాత్రంబులు నిరూపింప నేరనైతి. దేవార్చనా సమయంబున సంకల్పించుటకు సంవత్సరమో, ఋతువో, మాసమో, పక్షమో, వారమో, నక్షత్రమో యేదియుఁ దెలియక శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం బనుచుందు. పేరునకు మాత్రము దేవారాధనయే. నీ రూపమే ధ్యానీయము. నీ నామమే జపము. అక్కటా నాలుగు మాసము లింత కష్టముచే గడిపితినే. నీ కొఱకేగదా. ఒక్కొక్క తూరి బలాత్కారమున నీపై బడనుద్యమించి, నీ సమ్మతి లేనిది రాజధర్మ విరుద్ధమనియు నపవాదమునకు వోడియు మానితిని. నావృత్తాం తం బెఱిగింప నెంతయో సాహసించితిని. నీ యొంటిపాటు తటస్థపడదయ్యె. నేఁడు సఖీ జనుల నా కనుసంజ్ఞచే నావల నంపించితి. నీ సఖీజనులు వీరిరువురు నా యాంతరంగికులని నమ్ముము. నే సన్న్యాసి నది వారలకు మొదటనే తెలియును. నేఁడు నా నిజ స్థితి దెల్పినంతనే నా కోర్కె నమ్మనర్పించి యిమ్మోయి నేఁగుట న్యాయమా?

అదే పంచశరుండిక్ర ధనుర్ధరుండై పంచ శరంబులు సంధించి నా హృదయమును లక్షించి విజృంభించి గుప్పించుచున్నాడు. కొంచము సేపు కనికరింపుమా;

సుభ—(సిగ్గుచే తలవంచుకొని మౌనమున నిలచి యుండును.)

అర్జు—పలుక వేల; నిరుత్తర మంగీకార సూచకమా?

సుభ—రాజవర్యా! బాలిక, సిలీల బాలి జెందించుట మేలు గాదు.

(౨౦ అనుబంధము.)

నా చేయి విడువుము (తప్పించుకొన బ్రయత్నించును.)

అర్జునుడు (౨౧ అనుబంధము.)

నే తాళజాల నింక బిగువు వహింపకుము.

సుభ—ప్రాకృతులవలె నింతాతురబడిన నాయత్న మేమి?

అర్జు—

సీ॥ గాంధర్వమున నాదు కాంక్షలుఁ దీర్పవే।
మౌనంబిదేలనే మంజువాణి॥
పంచసాయకు కేళి పాలింప వేవేగ।
తప్పేమి దెల్పవే ధవళనయన॥
యధరామృతం బిచ్చి యానంద మొసగవే।
మారు మొగంబేలె మాయలాడి॥
యిటువంటి సమయ మింకెప్పుడు దొరుకునే।
యాలస్యమేలనే యబ్జపాణి॥

గీ॥ పలుకవే మధుర సాతీత భాషణముల।
గూడవే మోహవారధిగాఢ రతిని।
తెల్పవే నీదు కోర్కె సందేహమేల।
చెలియరో నా మనంబింక నిలుపఁ జాల॥

సుభ—మా పెద్దలు గలరు. వార లెరిగి వివాహ మొనర్తురు. ఇపుడు క్షమించి నన్ను విడువవలయు.

అర్జు—

కం॥ మీయన్న యెఱుఁగుఁ డెన్నఁడు।
వాయక మన కిర్వురకును వైవాహికముల్।
జేయుట దెన్నఁడు తగునే।
కాయజుఁడడె నించె పుష్పకాండంబులచేన్॥

ఇదిగో నే జెప్పలేదనియెదవు, ఇప్పుడు గాంధర్వమున కసమ్మతిం జూపకుము. తప్పించుకొని అంతఃపురంబున కరిగితేనిని కంతు కుంతంబుల కోర్వఁజాలవు. నా మాట వినుము.

(నేపథ్యమున సముద్వోతియని ధ్వని వినఁబించును)

సుభ—(ఆతురము చే)

చం॥ కరమిటు బట్టనేల నదె కాంతలు వచ్చుచు నున్న వారలీ।
తెఱఁగు నెఱింగి రేని జగతీపతి నింద్యకు పాత్రులౌదుమో।
పరమ దయానిధే మనసుఁ బట్టరి దేల భవత్సమానులా।
తెఱఁగడ కార్యవత్నమే సాటితోఁడనె లగ్న మొసర్ప ఖండునే॥

(అని చేయి వదిలించుకొని నిష్క్రమించును).

అర్జు—

కం॥ సరుడని యెందుకు దెల్పితి।
కరమేటికి బట్టుకొంటి కార్యము చెడెనే।
తెఱఁగుల్ దోపదు మారుఁడు।
సరసిజ శరులురిమె తాళఁజాలగనౌనె॥

ఈ తాపమున కేమాదనో తెలియకున్నది. బయలఁ బడితి. కార్యము చెడినా. నిక బలరాము డెఱింగెనేని నిరాశయో లేక దురాశయో. అదురోధనుండిటుచు వచ్చియే యున్నవాడు. కానిమ్ము.

(అవనిక పడును.)

## షష్ఠాంకము — ప్రథమ రంగము.

—:—

సుభద్రాంతఃపురము.

సుభద్ర—

మత్తే॥ వరియింపఁదగు భామినీయని మహావాంఛన్
మదీయాబ్జభా,
సుర హస్తంబటువట్టి వేడికొననే శుద్రాత్మనై
వచ్చితిన్,
స్మరుడా వెంట సరోజబాణముల దుర్మార్గంబుచే
వైచుచున్
బరతెంచెన్ వడి తాళజాల నరభూ, భామేశుతోఁ
గూడకన్॥

నేనెంత మూర్ఖురాలనైతి. కరమువట్టి కోర్కె దీర్పుమని యెంత వేడికొన్నను బిగువుచే జనుదెంచితి. నిచ్చట మూరు బారికి గురియగు చున్నదాన. నేమిసేయుదు. మరల నుద్యానవనమునకున్ బోదునా; సరిగాదు.

(రుక్మిణీ సత్యభామలు ప్రవేశము.)

(సుభద్ర లేచి నమస్కరించును.)

రుక్మి—సుభద్రా! నీ ముఖమేటికి వాడియున్నది?

సత్య—మరదలా! నిన్నటి నుండియు నాయాసపడుచున్న దానవని కుముద్వతి చెప్పె. ఎందుకు?

రుక్మి—భోజనమే లేదో?

సత్య—ఏలనమ్మా! మాట్లాడవు?

రుక్మి—నీ కేమి అదియ సమో నాతో జెప్పుము.

సత్య—స్వరాయాస మేమొ?

రుక్మి—కాదు, కాదు, నరాయాసము గావలయు.

సుభ—దేవీ! యెప్పుడు వున్నట్టే యున్నాను. ఎందు కిట్లనియెదరు?

రుక్మి—అయితే యీ దినము యతి సేవకై చనియుంటివో?

సుభ—పోలేదు.

సత్య—ఎందుకు పోలేదమ్మా! అయ్యగారి యేమి, భిక్ష యొసగువారెవ్వరు?

రుక్మి—అయ్యో! దిక్కులేని సన్యాసినిఁ జేసితివే పాపము.

(సుభద్ర తలవంచి యూరకే నిలచి యుండును.)

సత్య—అక్కా! మన మరదలేమి యొక తీరున నున్నది. నూతన బాల్యాధిక యౌవ్వన గదా పాపము. మనమునందేదియో యొక రాజ గ్రహము సోకి యుండవలయు.

రుక్మి—ఐతే నా సన్యాసిచెంతకే దోడ్కొని పోదము. ఆయన యంత్రతంబువలసి మంత్రించును.

సత్య—సుభద్రా ఆ సన్యాసితో కట్టించుకొని రమ్ము తాయెత్తును.

సుభ—(సిగ్గు జెందును)

రుక్మి—(నవ్వి) చెల్లెలా, సత్యా! యీ చిన్ని మరదలి నిక గేలిసేయ దగదు. తొల్లి మనము సహా యిట్టి యవస్థ ననుభవించిన వారమే గదా?

రుక్మి—సుభద్రా యోజింపకుము.

(3వ అనుబంధము).

నీ కోర్కెకు భంగ మొనరించు వారెవ్వరు నిచ్చట లేరు. మా బలరామ భావగారును మీ దుర్యోధన భావగారును రైవతకాద్రికి జనియున్నారు. మీ యిరువురిని యింద్రప్రస్థమునకు బంపించమని కృష్ణమూర్తి సెలవొసంగి యున్నవాడు. దారకుడు రథంబాయత్తపరచును లెమ్ము. శుభస్య శీఘ్రము.

(సుభద్ర నిష్క్రమించును).

సత్య—సముద్వతీ! ఉద్యానవనమునకుఁ జని యది వరకే యతి వేసము విసర్జించి సమస్త రాజ లక్షణ శోభితుడై యున్న నా అన్నగారైన అర్జునుని శుభ వాద్యములతో దోడ్కొని రమ్ము, పొమ్ము.

(సముద్వతి నిష్క్రమించును.)

రుక్మి—ఉత్పలా! మన పురోహితులైన గార్గ్య మునీంద్రునిఁ బిలుచుకొని రమ్ము.

(ఉత్పల నిష్క్రమించును).

(గార్గ్య మునీంద్రుడు ప్రవేశము).

శ్లో॥ విశ్వం విష్ణుర్వషట్కారో భూత భవ్య భవత్ప్రభుః।

(అని విష్ణు సహస్రనామ పారాయణము జేయుచు ఉత్పల సహితముగా ప్రవేశించును.)

(అర్జునుడు రాజ అక్షణమున మంగళ వస్త్రధారియై కుముద్వతీ సహితముగా ప్రవేశించును.)

గార్గ్య—సుముహూర్త మస్తు. సుప్రతిష్ఠిత మస్తు.

(చెలులు నిష్క్రమించి సుభద్రను దోడ్కొని వత్తురు).

(సుభద్ర సర్వా లంకార శోభితయై మంగళ వస్త్రధారిణియై ప్రవేశించును).

గార్గ్య—

శ్లో॥ తదేవ లగ్నం సుదినం తదేవ।
తారాబలం చంద్రబలం తదేవ।
విద్యాబలం దైవబలం తదేవ।
లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి॥
సుముహూర్త మస్తు. సుప్రతిష్ఠితమస్తు॥

(అర్జునుడును, సుభద్రయును పుష్పహారము లొకరి మెడలో నొకరు వేయుదురు).

గార్గ్య—

శ్లో॥ కన్యాం కనక సంపన్నాం। కనకాభర ణైర్యుతాం।
దాస్యామి విష్ణవేతుభ్యం। బ్రహ్మలోకే జిగీషయా॥

(అర్జునుడు సుభద్ర కరగ్రహణం బొనరించును.)

గార్గ్య—

సీతా రాఘవయో ర్వివాహ సమయే కుర్యాత్సదా మంగళం॥
సావధాన, సుముహూర్తా సావధాన, శ్రీలక్ష్మీ నారాయణ
ధ్యానా, సావధాన॥

(అందరు మంగళముఁ బాడుదురు).

(అవనిక బడును.)



షష్ఠాంకము - ద్వితీయ్య రంగము.



అరణ్యము.

(సుభద్రార్జునులు రథారోహకులై పోవుచుందురు.)

(నేపథ్యమున భయంకర ధ్వని వినుపించును).

(ఖడ్గధారియై దుర్యోధనుడు వికర్ణ సహితముగా బ్రవేశించును.)

దుర్యో—

పంచ॥ ఓరీ నరాధమాధమా మహోగ్ర మానసుండవై।
కురంగ నేత్రి దెచ్చితేర ఘోరక్రూర కర్మతాస్ఫుర॥
న్మదుగ్రణంబు వచ్చినన్ విమర్దనంబుజేయుదున్।
శరప్రపూర్ణ ఘట్టనంబు సైప రాదుణంబికన్॥

(అని బాణము వైచును. అది తప్పించుకొని)

అర్జు—

పం॥ నృపాలనీచ నీకొసంగనేర దెచ్చితిన్ సఖీన్।
కపాలికం బసాధనుల్ వికావికంచు నవ్వరా।
యపార ఘోరబాణ జాలమంబరంబ గప్పెనీ।
కపాల మోక్షణంబుఁ జేతుఁ గాంచు కౌరవాధమా॥

దుర్యోధనా! నీ పరాక్రమంబె నెఱుంగనా సరోవరమునఁ దొక్కి. ముసలిచే జచ్చుచుంటివి. ఇచ్చట బెదురెందు చున్నావు.

॥స్రగ్విణీ వృత్తము॥

సూతునిన్ గేతువున్ జూర్ణమొందించితిన్।
పాతకా భీతిచేఁ బారకన్ నిల్వుమా॥
ప్రేతరాట్ప్రోలి నీ పేరుఁగన్నారదే
రీతిగ నిల్చెనోరీ భవత్ప్రాణముల్॥

(బాణములు వైచును. దుర్యోధనుఁడు శక్తిలేక బగు వెత్తును వికర్ణుఁడడ్డము వచ్చి).

విక—దేవా, దుర్యోధనా! యిప్పుడైనను శంఖము బూరింపుము. మాయన్న బాణాసనాదిధరుడై జనుదెంచును.

(దుర్యోధనుఁడు వలదు వలదనుచు బర్వెత్తును).

(భయంకరాకారముచే బలరాముఁడు ముసలమును ధరించి ప్రవేశించి).

॥మానినీ వృత్తము.॥

ఓరి దురాత్మ నృశంసకఠోర మహోగ్రతనంబున నీచుడవై।
వారిజనేత్రనుఁగైకొని పోయెదొ వధ్యుడవైతివి చూడుమనన్।
క్రూర భయంకరమౌ ముసలంబునఁ గూల్తుర నీదు శిరంబు ధరన్।
వారిజవైరి కులోద్భవుడను గర్వంబునఁ జేసితివో యిటులన్॥

సన్యాసివలె జనుదెంచి నేను లేనప్పుడు మోసగించి నా చెల్లెలిని దురాత్ముండవై చోరునివలె గైకొని పోవుచున్నవాడవా? నా కపకారంబు గావించి దేవేంద్రాదులైనను బ్రదుకుదురా? కపట సన్యాసీ! నిలు, నిలుము.

అర్జు—భావా!

బల—భావా, యువా, యేమి వావులు గల్పింతువురా? ద్రోహీ!

అర్జు—నే నన్యుఁడనుగాను నీ ప్రీతి పాత్రుఁడను. నీ మేనత్త కొమారుఁడను.

బల—చాలు ఛీ! దురాత్మా! నా చెల్లెలిని విడిచి పొమ్ము. లేదేని నిన్నిప్పుడే యిదే యీ ముసలమున (అని రోకలి పైకెత్తును.)

అర్జు—ఔరా! పెద్దవాఁడవని నేనెన్ని విధముల నమ్రత జెందినను దుష్ట కీటక విషముఁ బోలె నీగర్వంబు ద్విగుణీకరించుచున్నదా? సకల జగద్విజయుండగు నీ విజయుండు మద్యపాన మదోన్మత్తుఁడగు నొక్క యాదవునకు వెరచుననుకొంటివే? హలము ముసలంబులఁ జూపి బెదరింతువా? ఇదో చూడుము.

(గాండీవం బెత్తును).

(శ్రీ కృష్ణమూర్తి అతురమున నిరువురి నడుమఁ బ్రవేశించి బలరాముని చేయి బట్టుకొని)

శ్రీకృ—అన్నా, బలరామా? మన మెంత యోచించినను విధి కృతమును దప్పించు వారెవరు? దశమీ గురువారము నాటి లగ్నంబేల నిలిచినది. (అన్యధా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్) ఇప్పుడు మన చెల్లెలి నర్జునున కొసంగక బలవంతమున దుర్యోధనున కొసంగెద మనుకొనుము. సుభద్ర దుఃఖము మన మేగదా చూడవలయు. నది గాక, అర్జునునిచే గాంధర్వమున కరగ్రహణం బాచరింపబడిన మన చెల్లెలు మరి యొకరిని వరించునా? వరింప వచ్చునా? మన మేమి క్షత్రియులము గామా? తనచే వరింపబడిన కన్యక నొరుడు వరింపఁబూనెనేని యీ యర్జునుడు పిఱికియా, పందయా, షండుఁడా, యూరకుండునా? తీవ్రాంశోపమ మార్గణ ధారాపాతం బొనర్చి కౌరవుల, యాదవుల వేయేల నిన్నును, నన్నును చిక్కుఁబెట్టఁడే. ఏలనిట్టి మొరకుదనము? సర్వజ్ఞుఁడవయ్యు మతి భ్రమ వీడకున్నవాఁడవు. నీవు దేవాంశుజుఁడవు. ఈ యర్జునుఁడెవరో, నేనెవరో, నీ వెవరో ఆదుర్యోధనుఁడెవరో, కను

గానుము. (ఆట్లే జూడుము) పాండవాగ్రజుండెవరో, యతన్మహానీయుని పాదాభివందనం బాచరించిన నెన్నియాగముల ఫలంబలవడునో, చాలు, చాలు, చాలు కష్టార్త బడకుము. కోపము జాలింపుము.

(శ్రీకృష్ణుడు అర్జునుని వంక దిరిగి).

పెద్దలపై నిట్లు తిరుగబడుట న్యాయమహానే, తప్పితముగాదా? మా యన్నగారి పాదాభివందనంబొనర్పుము.

(అర్జునుడు బలరామునకు నమస్కరించును.)

బల—కృష్ణా! యీ మాయలన్నియు నీవలననే జరిగినవని దోచుచున్నవి.

కృ—అన్నా! నామాయకానిదేది? అన్నియు నామాయయే. బ్రహ్మాదిస్తంభపర్యంతము నామాయయే. కాదన్నబోవునే?

బల—(అర్జునుని కౌగలించి) అర్జునా! మన్నింపుము.

అర్జు—భావా! దయ జూడుము.

(కృష్ణార్జునులు సుభద్రకు సైగ యొనర్తురు.)

సుభ—(బలరామునకు నమస్కరించును).

బల—చెల్లెలా! నీయిష్టాను వృత్తి వివాహ మొనర్పని మూర్ఖునిపై కోపగింపకుము.

(సుభద్ర సిగ్గుచే తలవంచి నిలబడును.)

అర్జు—దేవదేవులైన మీరిరువురును యింద్ర ప్రస్థమున కరుదెంచి యచ్చటనే వివాహంబొనర్పవలెనని ప్రార్థన.

కృ॥బల—తదాస్తు. శుభమస్తు.

(అందరు నిష్క్రమింతురు.)

షష్ఠాంకము — తృతీయ రంగము.

(ఇంద్రప్రస్థ పట్టణము.)

(కల్యాణ మంటపము.)

(ధర్మరాజు—భీముడు—అర్జునుడు—నకులుడు—సహదేవుడు—శ్రీకృష్ణుడు—బలరాముడు—గార్గ్యుడు—రుక్మిణీదేవి—సత్యభామ—సుభద్ర—కుముద్వతి—ఉత్పల—నిలచి యుందురు):

(సుభద్రార్జునులు [illegible])

([illegible])

(మానినీ వృత్తము.)

మంగళ మంబుజసంభవ వందిత మందర భూమీధరధీశా।
మంగళ మంగజసుందర శ్రీకర మత్త గజేంద్రోద్ధర యీశా।
మంగళ మద్రి సుతాపతి గోపిత మంత్ర మహేశా హరి శ్రీశా।
మంగళమంబుజ మిత్ర శశాంకన మాహిత నేత్రా పరమేశా॥

శ్రీకృ—అర్జునా! ఇంక నీకు కావలసిన దేమి?

అర్జు—దేవా నాకెయ్యది కొరతలేదు. అయిన నిట్లుగావలె.

అర్జు-

కం॥ ధరసర్వ సస్యయుతమై।
సురపతి యనుకూల వృష్టి శోభిలుగాతన్।
ధరణీ సురులకు జయమై।
పరమాత్మను గాంతురుగాత బహు తరగతులన్॥

---

స్వస్త్యస్తు.

---

(అవనిక బడును.)

---

శ్రీ. శ్రీ. శ్రీ. మంగళ మహా శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ

# సుభద్రార్జునీయ్యము.

## (అనుబంధములు).



(అను ౧) మోహన కళ్యాణి. ఆదితాళం.

నటు—మనసిజాపిత-మనుకులహిత శ్రీ- వనరుహనయనను-కనక
చేలా-అను దినమును బొగడెదరా-తనయుడ బ్రోవర-
దేవా రారా ॥మన॥

పాలయమాం హరి-భవభయవైరీ-దలచితిరా-శ్రీలలనాధిప
చిరతర భావా ॥మన॥

మారాధిక శృంగారా సుగుణా-సురచిరమణి గణవరభూషా-
వేగజూడరా యోగివంద్యభవ - రోగవైద్య శ్రీ - ఖగపతి
గమనా ॥మన॥

(అను ౨) బేగడ. ఆటతాళం.

ధర్మ—శ్రీహరి క్షేమము- దెల్పడా దేలనో-
రాజసూయాధ్వర రాజము దీర్చియు- వే జనెనా డాదిగ
నేటికెరుంగము ॥శ్రీ॥

పంపెద నొకచారుని-భద్రముగాంచగ-సొంపడ దేమో హరి
జూడక మాటాడక ॥శ్రీ॥

సోదరులారా శ్రీ-మాధవు సౌఖ్యము- మోదముగా దెలిన-
ముఖ్యము సత్యము ॥శ్రీ॥

(అను 3) గదునితో శంకరాభరణం ఆదితాళం.

ధర్మ—క్షేమములా సర్వులు-శ్రీ మధురాద్వారక పురముల ॥క్షే॥

ఆ మధుసూదను డల బలరాముడు - కాముడు సాంబుడు
గాలవుడు-నేమ మొందగను నిత్యయోగ ॥క్షే॥

భద్ర జాంబవతి మానిని రుక్మిణి భద్రములా సుభద్రయును-
ఆర్ద్రహృదయులై యులరెదరా ॥క్షేమ॥

అర్జునుడు ధర్మరాజుతో.

(అను ౪) కమాజ్. ఆదితాళం.

అర్జు—భూమిపాలకా వినుమా-గనుమా-దయతో మనవి ॥భూ॥

భూమిదేవు గోవు_బోయెనని వేడ-సమరంబుకై-గాండీవము-
గైకొంటినీ-వేగా చే_తమ గృహమున ॥భూ॥

చోరు ద్రుంచివైచి-బారుగోవునిచ్చి - బారా తెంచితీ - గానీ
మన-నేమంబుకై-యేడాది-ధరదిరిగెద ॥భూ॥

ధర్మరాజు అర్జునునితో.

(అను ౫) కన్నడ. రూపకం.

ధర్మ—ఇదియేమి చిత్రమౌర సోదర ॥ఇది॥

మది దోచదాయె నేర-ముదమూన భూమిసూర-పదపోష
ణంబు పాపమేమిర ॥ఇది॥

పరకింప భూమికన్న-ధేనువు-నరయంగ దిరుగమన్న - గురు
పాతకంబు లెన్న-దరిజేర్చునన్న మాను మానుము ॥ఇది॥

గార్గ్యముని ప్రవేశము.

(అను ౬) భైరవి. ఆదితాళం.

గార్గ్య—సరసిజా నేత్రా శౌరీ-సామజ వరద శ్రీ ॥సర॥
పరమ దయానిధే-పాలయమాం హరే-శరణు శరణు ముర-
హరణ భక్తాపోష ॥సర॥
మరచితివో నను-మాధవ శ్రీధర-నిరుపమా వేదా వేద్యా
నిర్మలాకార సిత ॥సర॥

అర్జునుడు, విశారదుడు గంగా నదీ ప్రార్థన.

(అను ౭) ఆరభి. ఆదితాళము.

అర్జు—సాంబ జటాతటరంగే-సారస శోభిత భృంగే-అంబరచుం
బితభంగే-అంబుధి నాయక సంగే ॥సాం॥

విశా—బిందు సరోవర నిలయే-సుందరధారిసుతసగే-బంధితపాత
కనిచయే-సాంద్ర యశోల్లస సుతియే ॥సాం॥

అర్జు— పాతకశైల కుఠారే-సీతాద్రీశ్వర చారే-మాతే నిర్మలవారే-
ప్రీతోస్మినువిచారే ॥సాం॥

విశా—జహ్నుసుతే-శుభభరితే-వహ్నిముఖామర వినుతే-ప్రాహ్ణ-
ముఖార్చన నిరతే-పాలయమాం శ్రీత్రిపథే ॥సాం॥

ఉలూచి ప్రవేశించునప్పుడు:

(అను ౮) బేహాగ్. ఆదితాళం.

ఉలూ—హా! మరుని గాథా-దరమా ॥హా॥
మారవైరి నిదెమది దలచుచును - నిరతము విసికితి సహా
తాళాగ ॥మరు॥

పాణినంటి నా ప్రాణ నాథుడు-మానకెన్నడో మది వనువు
టహో-దినములు కడజని గిరీశా సాంబ ॥మరు॥

దీక్షబూని సంవత్సరాంతమూ-దేవదేవుని కరుణ గలుగదు-
నరవరు గనుగొనక యోతాళాను ॥మరు॥

(అను ౯) ఉలూచి అర్జునునిఁ గాంచి.

ఉలూ.—ఎంత సుందరాంగుడో యీ-భువన మోహనా కారుడు-
కంతుడో వసంతుడో జా-యంతుడో అనంతుడో - వింతగ
భూకాంతనేలే-వీరశ్రీ నృపాలుడో ॥ఎం॥

చంద్రుడో-ధనేంద్రుడో-ఫుపేంద్రుడో-మహేంద్రుడో-
యింద్రనీల నిభాంగు డెవరో-యేమిదో చదాయుగా ॥ఎం॥

ఉలూచి అంతఃపురమున అర్జునునితో.
(అను ౧౦) దర్బారు. అటతాళం.

ఉలూ.—మోహనాంగా లేచిరారా-బ్రోవర సామిగ-సాహసము
మానీ నను చాలా రతిదేల్చ్యారా ॥మో॥

చందురూని కాకాలకు-గుందీతిర సుందరాంగ-పొందరా-
యింత తొందరా-హారకంధరా-వందనంబు లందరారా-
కేందూముఖ రాజవరా ॥మో॥

మారుబారీ కోరూపక జేరీతిర సారాసా క్షూ-క్రూరమా-
యింత వైరమా-వట్టిబేరమా-ధారాధర కారాగుణ ధీరా
మణి హారాదొరా ॥మో॥

## ఉలూచి అర్జున డైలాగ్.

(అను ౧౧)

ఉలూ—బ్రోవర నను కరుణనిధే-ముదమున ॥బ్రో॥
ధరణీ రమణా - దరిజేరుపుమా-స్మరు బాధకునే- వెరచితి
పలుమరు ॥బ్రో॥

అర్జు—చాలును విడు సరసములు-తగదిటు ॥చాలు॥
చెలియరో నీకీ-తలపు మేలకే - పలుమాటలుని - శ్చలమతి
బలుకకు ॥చాలు॥

ఉలూ—అను దినమును నిను మనమున దలతుగా-మనవిని గను
గొను ప్రాణేశా-మానక మారుని కేళిని దనుపుము ॥బ్రో॥

అర్జు—పరసతి గవయుగ వెరచెద తరుణీ-హరిహరి పాపము గాదట
వే-మోహము వీడుము తాళుము గుణమణి ॥చాలు॥

(అను ౧౨) కేదారిగౌళ రూపకం.

అర్జు—నాగవేణి నిన్ను గన్న రాగ మొదువదే ॥నా॥
నాగలోక భోగ భాగ్య భాగధేయము నందుజేర్చి-భోగ
మొనగ గోరి యున్న-పుండరీకాయతాక్షి ॥నా॥

భువన మోహన-శ్రీవిలాస-పూర్ణ సంతస మాయనేడు-
భవుని కరుణ గల్గె మనకు-పణతి సంశయ మొందకింక ॥నా॥

అతను కేళిలోన దేలి-యాత్మజాని గాంచి మించి-సతుల
లోన కీర్తి వడసి-సౌఖ్య మొందు మింక బాలా ॥నా॥

(అను ౧౩)

విశా—దయానిధే-దాయానిధే ॥యను తరహా॥

కాండీరమా-గాండీవిని-గానావేమొగా ॥కాం॥

గిరిధీరుని-మణిహారుని-నరనాథుని-ఘన శౌర్యుని-నెరిగానక-

నిటుగుండితి-సరిదెల్పుమా-త్వరతోడుత ॥కాం॥

కోదండ-వరగుణ సుమహిత- వేదండ-కరసమ భుజయుతు-

నీదండ-కనుగొన కలశితి- వేధోండ-పటుగుణాఢ్యు-శుభ నిరీ

క్ష్యు-రిపు కృతాంతు డెటజనె దెల్పుము ॥కాం॥

(అను ౧౪) హిందూస్థాని. అసావేరీ. ఏకతాళం.

అర్జు—శంకర పాలయమాం-గిరిజా రమణా ॥శం॥

బింక మేలరా వరాంగ భరితా-హారహార భవహర నారద

వినుతా ॥శం॥

కామసంహారా-కాద్రవభూషణ-సోమకళాధర సూరిజనావ

న-దేవపావనా-పరముకగుణధర-గిరిజావారా-పాహిమాం-

॥శం॥

(అను ౧౫) శ్రీరాగం. ఆదితాళము.

అర్జు—క్రూరులు-కౌరవ ధీరులు యాదవ వీరులు నాకెదురెవ్వరో

కో-ఘోరశరంబుల వైరమడంచెద-వారిజనాభుని కూరిమి

గాంచెద ॥క్రూ॥

సురగరుడోరగ నర విద్యాధర-వరులెదురైె వచ్చినరానీ-

బరచెద-జెరచెద-నరికెద-నురిమెద-కరివరగమనను గైకొని

వచ్చెద ॥క్రూ॥

(అను ౧౬) కాంభోజి. ఆదితాళం.

సుభ—మదనూని సూన శరములు-పదునూరె-యదదూరె-మది
జారే నిదియేమో ॥మద॥

తాళాజాలాను మోహ-తాప మగ్గలమాయె-నేలీల విజయ
భూమి-హాలూడేలూనో ॥మద॥

చందూరు-కాకాలాకు-గుందితి నిందిందిర-బృందా రొదలు
భయ-మొందించె నాహో ॥మద॥

(అను ౧౭) జంఝూటి. రూపకం

రుక్మి—చాలా దినములాయె సవ్య-సాచినిఁ జూచి ॥చాలా॥

శీలా తీర్థయూతా్ర-లోలూడవై బహు-జాలి జెందియున్న
వాని-శ్రీలోలూడూ దెల్పగ విని-జను దెంచితీని ॥చాలా॥

క్షేమమా ధర్మజ-భీమూమూద్రేయులు-సోమశేఖరు కృప
చేత-యీాఁ-క్షేమామూ లేదే భూమాత-శ్రిత పారిజాత
॥చాలా॥

వాసావీయీ దుర-వస్థయా సన్యాస-వేసము బూనితి వేల_
జూడ_గాసిని జెందితె చాలా-సద్గుణ శీలా ॥చాలా॥



(అను ౧౮)  కాంభోజి.  జంపె.

అర్జు—శ్రీరామ చంద్రాయ - సీతాహృదీశాయ - నారాయణా
నమస్తే ॥శ్రీరా॥

సాకేత నిలయాయ-సౌమిత్రి సహితాయ-శ్రీకంఠ మిత్ర
వందే ॥శ్రీరా॥

కౌసల్య తనయాయ – కంజాత నయనాయ – కాకుత్స్థవంశ
పాహీ ॥శ్రీరా॥

(అను ౧౯)  కళ్యాణి.  రూపకం

సుభ—పాలయ గిరిశా సతీ- దేవీ-నీవేగతీ ॥పాల॥

నీలఘ నోపమ వేణీ-శ్రీలలనాధిపనుత సంశీలా గుణజాల
శాల ॥పాల॥

కలకాలము నెర నమ్మితి-కఠిన చిత్తమేలా_యిలలో నీవలె
నెవ్వరు-గలరని యున్నావో-వలపొందితి-వగ జెందితి-దల
చితి నరభువిపాలుని-వరుగా నాకొసగవమ్మ ॥పాల॥

(అను ౨౦) అఠాణ. రూపకం.

కుము——సతిని బొగడ-తరముగాదు-సదయ హృదయ-రాజ
చంద్రా ॥సతి॥

అతనుబాణ-మనగను-సమ్మతిముతోడ నెలయుచుండు-
అతులిత శతరూపసమా-న్వితపతి హితచరిత సత్య-రతి
సమానరూపగాన ॥సతి॥

మినుక కాటుక, కనులదీర్చి-ఘనశశిభూషణములుదాల్చి
మనమున నంతస మొందెడి-వనితఁగని, మున్నైనను
మనసిజ బారికి నోర్వగు ॥సతి॥

కాంతమనసు-నంతయూను-కొంతేయూనిన్నుఁగనయు
నెంతయునను దినమునుత్రిపు-రాంతకునత్యంతభక్తి సంతతము
భజించుచుండు ॥సతి॥

(అను ౨౧) ఆనందభైరవి. ఆదితాళం.

సుభ——వాసూదేవకృష్ణశౌరి-గోత్రాధారీ-దాసాపాపహారీ
దానవవైరీ ॥వాసూ॥

నాకోర్కెనెర వేర్పవేలా-శ్రీలోలా-రాకాంబుజఫాలా
రాజగోపాలా ॥వాసూ॥

పరమపూరుష నందకందా-గోవిందా-దురితనిర్బంధశ్రీ
వరదా, సానందా ॥వాసూ॥

(అను ౨౨) కన్నడ.

సుభ—స్వీకరింపుమా- దేవా-శ్రీకరా మహానుభావా ॥స్వీ॥

పాకశాసనాది దేవ-లోకవినుత సాధువా ॥స్వీ॥

ఇవె జాతిపుష్పములు-యివె కుందగుచ్ఛములు
ఇవె పక్వఫలాములు-యివె కంజనాళాములు ॥స్వీ॥

పల్లవములజూడుము-యుల్లమలరగాంచుము
వల్లవేశునానతీ-వచ్చితియతీశ్వరా ॥స్వీకరిం॥

(అను ౨౩) శంకరాభరణం. రూపకం.

అజ్జు—ఈసుందరాంగి నెన్నగా-మదినోచదాయె ॥యీసుం॥

వాసరనాయకభూసుర-వాసవులకున్నైన దరమె ॥యీసుం॥

కందర్పునివరసతియో-బృందారక హితవతియో
యిందీవరదళలోచన-కుందరదనకుందివేణి ॥యీసుం॥

సతియో, భారతియో-సద్గతియో యనదగునీసతి
యతులితభాసురసుందర-పతిసువ్రత రతహితమతి ॥యీసుం॥

(అను ౨౪) దేవగాంధారి ఆదితాళం.

అజ్జు—యేదయానీదయా-రాదదెందుకు, హరా ॥యే॥

వేదఘోషాణారిపు-భేదనాదానాథునా ॥యే॥

శంకరాభక్తవ-శంకరాభావాహరా-సంకటాహారాణగౌ-
ణాంకధరాశివా ॥యే॥

ఫాలలోచనాగుణ-లీలశీలాత్మక-జాలమేలారా-యిక
చాలునుబ్రోవర ॥యేద॥

(అను ౨౫) జంఝూటి. ఆదితాళం.

సుభ — వనరాజమూ - మోదము-వనరుహాలోచనగాంచుము ॥వనరా॥

కిసలయముల్ - మెసవిహాయల్ - వాసిమీరగూసెపికములు ॥వనరా॥

పలువిధముల్ - వలపుల మేల్ - జాలిదూలదేర్చెనీ ॥వనరా॥

కుందములివెమా-కందములవెనా-డెందంబధికానందంబయె ॥వనరా॥

(అను ౨౬) కర్నాట్. ఆదితాళం.

సుభ — సుదతీరో యంత సుందరమైనవాడే-సుమశరునిసముడే ॥సు॥

వదనము పూర్ణిమ-వనజారిజోడే సుద॥

తీర్థయాత్రలు జేయూ-దివిరియే తెంచిన-పార్థాభూపూడాని
భ్రాంతిజెందితిగదవే ॥సుద॥

భాసురాంగుడైన-వాసవియితడైతే-గాసిసహానస్య
వేసమిదేలనే ॥సుద॥

(అను ౨౭) జంఝూటి. రూపకం.

అర్జు — మోహనాంగినిన్నేకోరి-మోహినైతినే ॥మో॥

సాహసముమాని నన్ను-చాలాబ్రోవవే ॥మో॥

మారుబారికోర్వలేక-మరులుజెందితి
సారసాననానాదుకోర్కె-దీరనేలుమా ॥మో॥

చిన్నతనమునుంచి మనమనము-గన్నవారము
పన్నగాలకసిగ్గువీడుము-నన్ను గూడుము ॥మో॥

(అను. ౪౮) రూపకం.

సుభ—నృప-కుమారదగు నే-యపాగ మోహముగనగా
హరి-కృపాకటాక్షముజెందు- తాప మోపగలవిందు
ప్రాపు-జూపి-లోప-మాపి-బ్రోవకుందు నేసదా ॥నృప॥

చెలు-ల దేజూచెదరు-బుధార్చితాయిక విడుమా
పరు-విధంబున నుసల్పెదవు- వేద బోధితుడవీవు
లేదు-వాన-మూన-రాదు-నాదరింబు జూపుమా ॥నృప॥

(అను. ౪౯) రూపకం.

అర్జు—సరోజముఖి_ తాళజాలబ్రోవవే
మారు- శారి-కోర్వ-జాల వేరుసేయు నేల నే ॥సరో॥

జేరిపొందగోరినాడ-నేరమెంచకే యికనె-పరమ-కరుణ
జూచి-నాదు-సరస-జేరి-మారు బాధదీర్పవే ॥సరో॥

కోరికోరి వేసరిలితి-క్రూరగ జేల నేచెలి-మునులు
బూని-విరుల-పాన్పు-దరికి-చేరు- తామసింప నేల నే ॥సరో॥

(అను. ౫౦) కేదారగౌళ. రూపకం.

రుక్మి—పంకజానన_పలువిధాముల—పరితపింపనేల వలదు వలదు
చెలియా ॥పం॥

మీనకేతుని—బాణభీతిని—దీనతజెందితె—తీవ్రగతిన్
వానవమోహినీ—మానరుగూడినీ—మానసకేళినీ
మరులుజెందు, తరుణరమణీ ॥పం॥

సంతసింపుము—స్వాంతమందున—చింతనహింపగ శ్రే
యమేమి—కాంత—నీకాంతునీచంత చేరినురు
భ్రాంతులదీరగ—బలుసుఖంబులొందుమబల ॥పంకజా॥



ఈ పుస్తకములు

అనంతపురం జిల్లా కదిరి గ్రామ నివాసికులైన

మ॥రా॥శ్రీ పిన్ను వెంకటశివయ్య శ్రేష్ఠిగారి వద్దను

మఱియు

మ॥రా॥శ్రీ భిషక్పండిత ఈశ్వరశాస్త్రిగారి వద్దను

దొరకును.

